# ప్రజా వాఙ్మయము



రచన:

**చింతా దీక్షితులు**





విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# పీఠిక

ప్రజా వాఙ్మయస్వరూప మిందు దిఙ్మాత్రముగానే సూచింపబడెను. పాటలు, పదములు, కీర్తనలు, హరికథలు, నాటుకథలు మున్నగువానిని గురించి కూడ తెలిసికొనవలసియున్నది. రోచనార్థము మాత్రమే ప్రజా వాఙ్మయస్వరూప మిందు కొంత ఆవిష్కరింపబడెను.

— చింతా దీక్షితులు



# విషయసూచిక





# ప్రస్తావన

ఈనాడు ఇంకా దీక్షితులుగారి పుస్తకానికి ఓ ప్రస్తావన కావాలనుకోడం చిత్రంగా వుంది. ఇప్పటి తెలుగు సారస్వతశాఖల కెన్నిటికో ఆయనే ఉపోద్ఘాతం.

దీక్షితులుగారి పుస్తకానికి చలం ఉపోద్ఘాతమా? సారస్వత పితృదేవతలకి ఆ లోకాలలోనైనా శాంతినివ్వరా?

ఈ పుస్తకంలోని వ్యాసాల్ని నేనిదివరకు చదవలేదు, వినడమే గాని. ఆయన ఈ విషయమై చేసిన కృషి నాకు స్వయంగా తెలీదు. ఆయన మెచ్చుకునే ఈ పాత వాంగ్మయంగాని (అసలు వాఙ్మయం అనే spelling నేను వొప్పుకోను) ఆయన తీసివేసే ప్రబంధ వాంగ్మయంగాని నా మనసుకెప్పుడూ దగ్గిరిగా రాలేదు. అసలు "పాత, పూర్వం" అనేప్పటికే నా మనసులో విరోధం ఏర్పడుతుంది. Anyhow they have to prove their merits to wine my favour.

ప్రబంధాల్లోనూ, పాతపాటల్లోనూ, గొప్ప flashes of beauty వున్నాయి, కొందరు ముసిలమ్మల చిరునవ్వులో మల్లే, రెండూ సెంటిమెంట్ల పుట్టలు. ప్రబంధాల్లో సెంటిమెంట్లు అసహజం, అబద్ధం, అప్పుడప్పుడు అసహ్యం. ఈ పాటల్లో అందాలన్నీ సెంటిమెంట్లతో అల్లుకుని హృదయాన్ని సమీపిస్తాయి. అట్లాంటివి దీక్షితులుగారిని అప్రయత్నంగా ఆకర్షిస్తాయి. వాటిల్లో అందం వున్నచోటకూడా ఆ అందాన్ని కనిపించుకోను నేను. నన్ను పీఠిక వ్రాయమని ఆజ్ఞ.

నా బాలమిత్రు డొకరు యిటీవలే దీక్షితులుగారిని చూడ్డానికి వెళ్ళి నాకు రాశాడు. "ఆయనచుట్టూ ఒక ఆధ్యాత్మిక వాతావరణం ఆవరించివుంది. మీ రున్న అరుణాచలం వంటిది అనుకున్నాను ... ... ఆయనని చూస్తే ఎన్నడన్నా జీవితంలో ఈయన కోపమనేది ఎరుగునా?" అనిపించింది.

అవును, ఆయన కోపమనేది ఎరగరు. లోకాన్ని కోపపడవలసిన అవసరం ఆయనకి రాలేదు. ఎంతవరకైనా ఆయన కోపాన్ని చూడగలిగింది యీ సహజమైన భాషని పైకి రానీక అణగతొక్కే పండితుల మొండితనం. ఆయన దిగులంతా దిక్కులేక నశించే అందమైన యీ పాత వాంగ్మయంపైన.

ఆయన ఎప్పుడూ ఈశ్వరభక్తులు.

ఆయనకి ఎప్పుడూ—

God is in His Heaven<br>
All is right with the world.

సర్వజ్ఞుడైన ఈశ్వర స్వరూపం ఈ ప్రపంచం. దాన్నీ, దాని ప్రకృతినీ ప్రశ్నించవలసిన అవసరంగాని, అర్థంగాని, ఆయనకి కనపడలేదు. నేనా? నన్ను ఈశ్వరుడు ఒక question mark చేసి సృజించాడు. ఆ question mark తన సృష్టికర్తకే ఎదురునిలిచి "ఏమిటి ఇదంతా? ఏమన్నా బుద్ధికరుణావున్న వ్యవహారమేనా?" అని ప్రశ్నించింది.

'ముళ్ళల్లోంచి గులాబిపువ్వు వొచ్చింది, చూడు ఈశ్వర మహిమ!' అని దీక్షితులుగారు.

"ఇంత అందమైన పరిమళమైన పువ్వుచుట్టూ ఈ ముళ్ళేమిటి? ఆ సృష్టికర్త కేమన్నా బుద్ధివుందా?" అని నేను.

ఇట్లా ఆలోచించడంతో ఆయన దృష్టి పువ్వుమీద నిలిచి మృదుత్వాన్ని పొందింది. సరే. నేను ఎంతమందికి ఎంత లోతుగా గుచ్చుకొన్నానో వ్రాయనక్కర్లేదు.

ఈ పాతపాటల విషయమై కూడా మా కదే భేదదృష్టి.

"చూడండి! ఈ అందాలు ఎంత లాలిత్యమో, ఎంత హృదయం కెట్టారో వీటిల్లో. ఎంత సహజంగా, సులువైన మాటల్లో చెప్పారో?" అని ఆయన కొట్టుకుంటున్నారు ఈ పుస్తకమంతా.

"నిజమే; నేనూ చూస్తాను ఆ కవిత్వం, ఆ అందం, కాని ఆ పాటలుపాడే ముసిలమ్మలూ, తల్లులూ వాళ్ళ మూర్ఖం వాళ్ళ ప్రేమలో ఆ చీకటీ—"

జోలపాటలో తల్లిప్రేమకన్న ఆ ప్రేమను పిలిచిన పిల్ల ఏడుపు వినపడుతుంది ఎక్కువగా నాకు.

"ఎందుకేడవాలి ఆ పిల్ల?" అని మండిపడతాను నేను.

నా చిన్నప్పుడు అర్ధరాత్రులు పసిపిల్లలు నా తమ్ముళ్ళూ చెల్లెళ్ళూ ఏడుస్తో వుంటే, నిద్రకళ్ళతో మా అమ్మ లేచివొచ్చి ఈ జోలపాటలు పాడుతోవుంటే - ఆ పిల్ల ఏడుపు,

"ఇంకా పడుకోవేంరా?"

అనే తల్లి అరుపు.

రాత్రి తరవాత రాత్రి విని, ప్రతిరాత్రీ "ఎన్నడూ పిల్లల్ని కనకూడదు" అని శపథాలు చేసుకున్నాను. నాకీ పాటలతో సానుభూతి ఎట్లా వొస్తుంది ఈనాడు?

ఏడ్చే పిల్లమీద, కన్నతల్లిమీద, తల్లినంత బుద్ధిహీనురాల్ని గా చేసిన సంఘంమీద, దీనికంతా కారణమైన ఈశ్వరుడిమీద ఎంతో కోపం!

'ఆ ఏడుపే లేకపోతే తల్లిప్రేమని పాప ఎట్లా పిలుచుకుంటుంది? ఇంత అందాలపాటలు ఎట్లా సృష్టి అవుతాయి?' అని వల్లగా అంటారు దీక్షితులుగారు.

అందం వుంటేవుంది, యీ పాత బూజు పురాణపు తుక్కంతా పడేసి నరకమనే నా వీరాలాపాల్నీ, యీ పాటల్లోని చిన్న చిన్న నాజూకుల్నీ రెంటినీ తన ఆలింగనంలోకి తీసుకోగలిగారంటే, ఆయన హృదయ వైశాల్యం తెలుసుకోవొచ్చు.

"నేను literary cosmopolitan ని" అన్నారు దీక్షితులుగారు. ఆ cosmopolitanism నా రచనల్నే కాదు; నా ఆచారాల్నీ, నన్నూ కూడా ఆదరించ గలిగినంత వైశాల్యమై పెరిగింది.

నేను రాసిన మొదటి కథనించి నన్ను ఆయన Merit వున్న రచయితగా గుర్తించగలిగారంటే, ఆయన కంటిని ఏ ముళ్ళల్లోని అందమూ తప్పించుకోలేదని తెలీదా? అట్లాంటప్పుడు యీ పాటలకు స్పందించకుండా వుంటుందా ఆ మార్దవ హృదయం?

ఈ కృతకభాషావాదులు పూర్వాచారపరులకన్న అంధులు. వాళ్ళకి ఏది చూసినా శత్రుత్వమే. పూర్వాచారాల్లో నిలిచిపోవలసినవి చాలావున్నాయి. కాని ఈ కృతకభాషలో ఉండిపోవలసింది ఏదీలేదు. వీరికి తమకన్న పాతవీ పనికిరావు. తమకన్న కొత్తవీ పనికిరావు. దురదృష్టవశాత్తూ ఈ కృతకవాదులే అధికారంలో వుంటోవుంటారు.

కాలం మార్పుని తనంతట అదే తీసుకొస్తుంది అంటారే అదెంతవరకు నిజమోకాని, మూర్ఖత్వంలోనూ Vested interests లోనూ మార్పురాదు.

"ఇప్పటికీ బ్రహ్మ -
మూర్ఖ చిత్త విస్ఫురణ మడంపలేక
తలపోయుచునున్న వాడొగిన్"

Fashions మార్తాయి. కాని, మూర్ఖత్వమూ, కదలనితనమూ నేర్చుకో నిరాకరించే మందుతనం, అంధత్వం, స్వార్థం, అట్లానే నిలిచివుంటాయి.

ఈ పాటల్ని విన తటస్థించినప్పుడల్లా వాటిల్లోని రసాన్ని గుర్తించి, అసలు తెలుగుభాషా, భాషామార్దవమూ, కవిత్వలక్షణమూ వీటిల్లోనే వుందని గ్రహించి వాటి పునరుద్ధరణకోసం దీక్షితులుగారు తహతహపడ్డారు. ఏ కఠిన పదజాలాన్నో కావ్యాలంకారాల్నీ, అసహజ పాండితినీ, ఎరువుతెచ్చుకోక, హృదయంలోంచి వొచ్చే ప్రేమకీ, అందానికీ, రంగులుపూయక స్వచ్ఛంగా, సూటిగా పాడిన ఈ పాటలకన్న కవిత్వం ఎక్కడవుంటుంది? ఎప్పుడూ నా నిశ్చితాభిప్రాయం ఏమిటంటే, సులభమైన భాషలో చెప్పడానికి శక్తిలేనివాడే కష్టమైనభాషని ఉపయోగిస్తాడని. వచనంలో చెప్పలేనివాడు పద్యంరాస్తాడు. సహజంగా అందం వున్న స్త్రీకి, విలవైన బట్టలూ, నగలూ అనవసరం. మనుషులు ఏవిధంగా తమ శరీరపు అందవికారాల్ని అందమైన బట్టలకింద దాచుకొంటారో, తమ మానసికపు వంకర్లని రంజకమైన మాటలవెనక మరుగుపరుచుకుంటారో, అట్లానే చాలాసార్లు

తమ భావశూన్యత్వాన్ని పద్యాలంకారాలవెనక మాయప్రపంచాలని చూస్తాడుకవి. ఇది అమితంగావుంది తెలుగు సారస్వతంలో. అక్కడక్కడ భాగవతాన్నీ, చాలా వరకు భారతాన్ని, పూర్తిగా పాత ఎంకిపాటల్నీ తప్పిస్తే, తక్కిన తెలుగు కవిత్వం ఈ విమర్శకిందికి వొస్తుంది.

ఈ పాటల్ని పాట లక్షణమేగాని, వీటికి కవిత్వాంశమేగాని దోష మేమాత్రమూ పట్టలేదు. ఎన్ని వీళ్ళనించో యివి తల్లి ప్రేమలో, భార్య పాతివ్రత్యంలో, చిన్నపడుచుల కల్లల్లో, పసిపిల్లల చిరునవ్వుల్లో, నాని, నాని, మెరుగు తీసుకుని, ఎన్నివేల హృదయాల తపనల్లో పోగుచేసుకుని చిత్రికపడి యీ రూపాన్ని పొందాయి.

ఏడవకు అబ్బాయి ఏడవకు తండ్రీ

అంటే, ఆ మాటల్లో ఏమీలేదు కాని, మన చెవులకిమాత్రం - ఆ ఏడుపును భరించ లేని తల్లి ఆవేశం, ఆమె ప్రేమ నిస్సహాయత్వం, "నే నున్నాను. భయం లేదమ్మా, నువ్వు దిక్కులేని వొంటరిలోకంలోకి రాలేదు చీకటిని చూసి భయపడకు. నే నున్నాను కదూ" అనే తల్లి యిచ్చే ధైర్యం, అన్నీ వినపడతాయి "అమ్మా" అనే తన అర్ధరాత్రి పిలుపుకి ప్రతిసారీ యింత అందమైన పాటస్వరంలో బదులు పలికే తల్లి కంఠస్వరం బిడ్డ స్వభావంలో ఎంతలోతుకి యింకి అతని జీవితంలో ఎన్ని పువ్వులుగా వికసిస్తుందో ఎవ రెరుగుదురు? తల్లి, బిడ్డలమధ్య అల్లుకునే ప్రేమకి శబ్దంలో, గానంలో రూపం తీసుకున్న యీ పాటల్ని, ప్రతి యింట్లోంచీ, ప్రతి రాత్రీ విని, విని నక్షత్రాలే ఎన్నడూ విశ్రమించని తమ నిరీక్షణా గుణాన్ని యీ పాటల కాపాదించాయి. ఏ దోషమూ అవరించని చిన్నపిల్లల హృదయ మార్దవం, ఏ లౌకికానుభవపు చిక్కుల్లోనూ మొద్దుబారని సూక్ష్మత స్త్రీస్వభావం లోని నిర్మలత్వమూ, లోకతీతమైన పురాణపురుషుల చరిత్రానుభవాన్ని తమ దోసిళ్ళలోకి, యిళ్ళల్లోకి తెచ్చుకుని యిముడ్చుకోవాలనే ముగ్ధల ప్రయత్నమూ యీ పాటల్లో ప్రతిఫలిస్తాయి. పెళ్ళికి, నలుగుకి, భోజనాలకి, వేళాకోళాలకి, ఏ సమయానికి మనసులోంచి ఏ భావం వొస్తే ఆ భావం పాటలకింద మారింది యీ స్త్రీల నవ్వుల్లో, కన్నీళ్ళల్లో కలిసి.

ఈనాడిట్లా అయిందిగాని, ఇంట్లోకి పాప రావడమంటె ఇంకో లోకం నించి తమని ఆశలనీ పెట్టడానికి, ఉద్ధరించడానికి దిగివొచ్చిన సౌందర్యరేఖగా చూసుకునేవారు. ఈ పాటలు వింటోవుంటే, తల్లి సంతోషం, ఎట్లా ఎక్కణ్ణించి ఈ ప్రేమమూర్తి తన తొడలమీదికి, కావిలింతలోకి వొచ్చాడు అనే అద్భుతం, వినపడతాయి. తన పాప వొంటిరంగు, చిరునవ్వు, చూపు, అన్నీ ఇంటికి వెలుగు. అతను దీపం. అతన్ని చూసి సంతోషపడనివారు అసంభవం ఆమె కంటికి తాను గొల్చే దైవమే తనకోసం రూపంపొంది తనచేతుల్లో వాలాడు. ఈనాటి నాగరికతా స్త్రీలలోనైనా కాన్పు అనేది సంతోష మివ్వకుండా పోలేదు. పిల్లల భారమనుకో వొచ్చు. ఇంకో పిల్లను ఎట్లా పోషించడమనే దిగులుపడవొచ్చు. కాని పాలివ్వక

పోవాలనుకున్నా, పాలుపడడం ఎట్లా తప్పదో, అట్లా పిల్ల కలగడం ఇష్టంలేక పోయినా ఆ మాతృభావం కలగకమానదు. ఆ ప్రేమా, సంతోషమూ మనసుని ఆవరించకమానవు. పిల్లని జాగ్రత్తగా చూసే వోపిక లేకపోయినా, ఆ బిడ్డప్రేమని ఆనందించే తీరుబడి లేకపోయినా, ఎప్పుడో ఏ నిముషాన్నో బిడ్డనించి ఏ ఏడుపో, ఏ చిరునవ్వో తల్లి హృదయాన్ని తబ్బిబ్బుచెయ్యకమానదు. పొరుగమ్మతో కబుర్లో, క్లబ్బులో చీట్లపేకో, సినీమా చూడడమో పిల్లకన్నా ఎక్కువఅయినా, ఆ పిల్ల పిలుపు మనసువెనక ఎక్కడో, పీకుతో వుండక మానదు. పిల్లనికని ఆ బిడ్డని అనాథనిచేసి ఏడిపించే తల్లులకి ప్రత్యేకంగా నరకంలో ఒక పేట reserve అయి వుండాలని నా ఆశ.

తన వాళ్ళెవ రెటుబోయినా, తాను దరిద్రురాలైనా, తనని గౌరవించేవాళ్ళు పలకరించేవారెవరూ లేని ఏకాకిఐనా, అందరికీ తాను లోకువైనా తనపిల్ల తన స్వంతం, తనవేపే చేతులు జాస్తుంది, తనని తప్ప ఎవరినీ "అమ్మా" అని పిలవదు. తనే దిక్కు. తనలోపాలు పిల్లకి కనపడవు, తనని అసహ్యించుకోదు, తను పిల్లకి అందం, దైవం. అదీ తల్లితృప్తి. తల్లి హృదయంలోని ఈ ఐశ్వర్యం ఈ పాటలన్నింటా ఆవరించింది.

ప్రియుల ప్రేమా, తల్లి పిల్లల ప్రేమా ఈ సృష్టి ప్రోద్బలానికి చాలా సన్నిహితాలు. ఎంత సృష్టించినా ఈశ్వర హృదయానికి ఎట్లా తృప్తిలేదో, అట్లానే ఈ ప్రేమల్లో ఎంతకీ తనివితీరడమనేది లేదు, ప్రియులకీ, తల్లులకీ. అందుకల్లనే నక్షత్రాలమల్లేనే "ఎప్పటికి?" అనే ప్రశ్నతో అనాదిగా ప్రియులూ, తల్లులూ వెతుకుతున్నారు ఈ విశ్వపు అంచుల్ని. ఆ నిరంతరాన్వేషణావేదనే కవిత్వమై ఇట్లా హృదయాన్నించి హృదయానికి, కంఠాన్నించి కంఠానికి పలుకుతోంది.

పిల్లలకి పాటలు రాయడమంటే సామాన్యమైన పనికాదు. మహాకవి కావడం చాలా సులభమైనపని దానికన్న. ఈ లోకాన్ని కొత్తగా తాను చుట్టూచూసి, అర్థమయ్యీ అర్థంకాక, తనతో దోబూచులాడే ఈ మాయాచ్ఛాయల్లోని ఇంద్రజాలానికి అద్భుతపడి దాన్నంతా తనలోకి తీసుకోవాలనిచూసే పసిబిడ్డ ఆత్రుతని తిరిగి ఏ కవి జీవించగలడు? ఏవొక్క దీక్షితులూ, ఏవొక్క టాగూరో తప్ప!

రంగులూ, గానాలూ విని పిల్ల, పూర్వజన్మస్మృతులవల్ల ఎక్కడో చూశానే అనే దూరపు జ్ఞాపకాలతో యీ అందాన్ని సమన్వయించుకోవడం, అనుమానం, భయం, అసహ్యం, ద్వేషంలేని హృదయంతో ప్రతిసృష్టి స్పందనానికీ ఎదురు పలకడం, ఏ మొద్దు పదజాలం వ్యక్తపరుస్తుంది? చివరికి టాగూరు కవిత్వమైనాసరే?

తల్లి ముఖం పిల్లకి మొదటి ఆటబొమ్మ. తల్లి వొడి వుయ్యాల, తల్లి కౌగిలింత మొదటి Welcome, తల్లి చిరునవ్వు ఆత్మకి మొదటి వెలుగు. తల్లి మొదటి పిలుపులోంచే అందుకుంటుంది పిల్ల, నిద్రలోంచి తనలోకి మేలుకొమనే సృష్టి ఆహ్వానాన్ని. ఈనాటికి, ప్రియుల సనాతనావేదనకి నండూరి సుబ్బారావుగారు,

పిల్లల నవ్వులకి దీక్షితులుగారూ, బి. వి. నరసింహారావుగారూ, తల్లుల హృదయ స్పందనాన్ని పలికేందుకు దీక్షితులుగారొక్కరూ జన్మించారు తెలుగుదేశానికి.

ఈ పాతపాటలు తాళపత్రాలలో లేవు. వీటికోసమై ఒక ఆఫీసు తెరిచి, పెద్దజీతాల్నిచ్చి, పండితుల్ని నియమించి ఏడాదికి నాలుగు పేజీలు ఓ పత్రికలో ముద్రించే ఏర్పాటు ఎవరూ చెయ్యలేదు. ఈ పాత భాండాగారమంతా స్త్రీ హృదయంలోనే నిలిచిపోయింది. ఆ హృదయం నశ్వరమైన శరీరంలో యిరికివుంది. అందువల్ల దీక్షితులుగారి తొందర ఈ పాటలు జనాంగీకారాన్ని పొందడానికి కాలమూ, పండితులూ అభ్యంతరాలు.

కాలం మారిపోతోంది చలం ధర్మమా అని, ఈనాడు ఉయ్యాలలూపి పిల్లలకి జోలపాటలుపాడే తల్లులులేరు. విద్యావిధానం ధర్మమాఅని ఈ పాతపాటల్ని బళ్ళలో చేరనీరు. వీరేశలింగంగారి ధర్మమాఅని వితంతువులు తెల్లారకట్ట పాటలు పాడడమే మానివేసి సినిమాల్లో చేరుతున్నారు. ఈ నవీన నాగరికతలో వేదంమల్లేనే ఈ పాటలూ నశిస్తాయని దీక్షితులుగారి భయం. పండితులు వీటిని చేరనీరు. పామరులూ వీటిని నిరసిస్తారు. ఇవి fashion కాదనీ, పాతకాలపునాటివనీ, వీటికి గౌరవంలేదనీ, తెల్లారకట్టే ముగ్గులుపెట్టి మజ్జిగచేసే కాలానికి సరిపోయినాయికాని, కాఫీ కప్పులముందుకు రమ్మంటే ఈ పాటలే వొప్పుకోవు రావడానికి.

ఈ పాటలు ఒక కవిగాని, కవయిత్రిగాని ఒకనాడు రాసినవికావు. దశాబ్దం నించి దశాబ్దానికి మామూలు అక్షరజ్ఞానంలేని స్త్రీల నోళ్ళలోపడి, వాళ్ళ అనుభవాలు, కొత్తపాటల్లోనూ, పదజాలంలోనూ, వాతావరణంలోనూ మార్పులు చెంది నిలిచిపోయినాయి. వీటినోసారి పోగొట్టుకుందా, మళ్ళీ పిలుచుకోగలదా దేశం ?

పోనీ కాలంలోనిలిచి ప్రచారంలోకి వొచ్చిన ఈ గానాల్ని వాఙ్మయంలో కలిపివేసి వాటికోస్థానం కలిపిద్దామంటే, ఈ పండితులు అంగీకరించరు. ఈపాటల్లో అందంవుందని అంగీకరిస్తే, భాషనికూడా అంగీకరించాల్సి వొస్తుందేమో, వీటికి గౌరవమిస్తే తమ గౌరవం ఎక్కడ పోతుందోననే భయంతో వీటిని స్త్రీల, పిల్లల, పామరుల పాటలని తోసివేశారు. అప్రయత్నంగా దీక్షితులుగారికి చేదోడు ఐన చలం, ఆ స్త్రీలూ, పిల్లలూ పండితులకన్న గౌరవనీయులన్నాడు. కమ్యూనిస్టులూ, నండూరి సుబ్బారావుగారూ "చాకలవాడు చదువుకున్నవాడికన్న మేలు" అని మళ్ళీ బాదారు పండితుల్ని పట్టుకుని.

కాలవశాన అధికారపీఠాన్ని వొదిలి కదిలిపోక తప్పించి కాదు పండితులకి. వాటిస్థానే ఇట్లాంటి పాటల్నీ, భాషనీ అంగీకరించడమే కాకుండా, వాటికోసం యుద్ధాలుచేసిన యువకులు, భాషా నిర్ణయ పదవుల్ని స్వీకరించారు. ఇన్నాళ్ళూ దానికోసమే ఎదురుచూస్తోవుంటారు సంస్కరణాభిలాషులు. ఈ ముసలివాళ్ళు ఏదో పాతపద్ధతులకి అలవాటుపడి అంధులై అభ్యంతరంగా వున్నారుగాని, వీళ్ళు

తొలగిపోయిం తర్వాత, ఆ కొత్తతరంవారు ఎంతో ఆప్యాయతతో వీటిని అంగీకరించి గౌరవించి అనుసరించి, స్థిరస్థాయిగా నిలబెడతారని, అంత వోపికలేని చలంబోటి వాళ్ళు 'ఏం లాభంలేదు ఈ అధికారుల్నీ, ముసలివాళ్ళనీ నరకమంటా'రు.

చూస్తుండగానే ఈ యువకులు పెద్దవాళ్ళయి ఉద్యోగాల్ని స్వీకరించి తమ ముందటివారు పలికిన మార్గత్వాన్నే, కొత్తమాటలతో పలుకుతారు, చిన్న చిన్న మార్పులతో. వీళ్ళకి ఉద్యోగాలు ఇచ్చేముందే వీళ్ళని జాగ్రత్తగా పరిశీలించి, ఎక్కడెక్కడ స్వతంత్రం, ఒరిజినాలిటీ వుందో, ఆ భాగాన్ని కత్తిరించి, విప్లవకారకాలయిన అవయవాల్ని చితకకొట్టీ, మరీ ఆ ఉద్యోగానికి నియమిస్తారు. ఉద్యోగి ఐకూడా ఏదన్నా స్వతంత్రపు పోకడలుపోయినా అతనికి అధికారంలో గతులులేవు. అసలు ఈ కొత్తఅధికార్లకీ ఇష్టం వుండదు. కొత్తమార్గాలు తొక్కడం, ఆ పాతవారి ప్రాపకం, అనుయాయిత్వం వారికి గౌరవాన్నివ్వాలి. పామరులు పలికే మాటల్ని వీరు గౌరవిస్తే ఎట్లా? వీరు పండితులైనారు ఇప్పుడు.

ఈ విధంగా యీ భాషకిగాని, పాటలకిగాని, వాంగ్మయంలో స్థానం ఏర్పడలేదు యీనాటికీ. లోకమంతా సహజమైన భాషే మాట్లాడుతున్నారు, రాస్తున్నారు, గట్టిగా పాతది పట్టుకుని వేళ్ళాడిన పత్రికలే, చందాదార్లు తగ్గిపోవడం వల్ల భాషని గతిలేక ఫిరాయించుకున్నాయి. పుస్తకాలు ఖర్చుగాక, గ్రంథకర్తలు పాండిత్యాన్ని మలిచారు, చివరికి రేడియోవారుకూడా, వాళ్ల అసహజపుగొంతుకలతో సహజమైన భాషని మాట్లాడకతప్పిందికాదు. కాని, యీ విద్యాలయాలున్నాయే, ప్రతి మనిషికోసం ఏర్పడ్డామన్న యీ విశ్వవిద్యాలయాలు, ఈ democratic ప్రజా సంస్థలు, ఇవిమాత్రం ఎవరూ మాట్లాడని, అర్థంకాని, కృతక కుళ్ళు, కంపుభాషనే విద్యార్థులపైన వేసి రుద్దుతున్నారు. పాత వాంగ్మయం పేరన్నా ఎత్తరు. ఇంకా ఈ పాటలు పామరులవీ, స్త్రీలవీ, పిల్లలవిగానే నిలిచిపోయినాయి. "మీరు తక్కువవారు, మీ మొహాలకీ పాటలు చాలు అన్నారా" ఈనాటి స్త్రీలు మడమ ఎత్తుల చెప్పులు విసురుతారు. స్త్రీలని సాంఘికంగా న్యూనత చెయ్యడానికి ఎవరికీ గుండెలు లేవు. ఆస్తికూడా వాళ్ళ పరమౌతోంది. కాని ఈ పాటలుమాత్రం అట్లాగే అణగారిపోతున్నాయి.

ఈనాడు పామరులకీ, స్త్రీలకీ ప్రత్యేకం పాటలూ అక్కర్లేదు, కథలూ అక్కర్లేదు. కావలిస్తే పండితుల్నే ఒకరు రాసింది ఇంకొకరికి అర్థంకాకండా పాండిత్యం చూపుకునే ఉద్గ్రంథాలు రాసుకోమంటారు.

ఎటొచ్చీ పిల్లలకి. వాళ్ళకేంకావాలో, అక్కర్లేదో చెప్పుకోనూలేరు, చెప్పుల్ని విసరనూలేరు. వాళ్ళకి నిర్ణయంకావాలి, దిక్కులేనివాళ్ళు కనక. పాటల్ని మించిన అందాలూ, పిల్లల హృదయాలకూ అనుభవాలకూ దగ్గరయిన పాటలూ, కథలూ సృష్టిఐతే వీటిని పునరుద్ధరించవలసిన అగత్యం కనపడక పోవొచ్చు.

కాని, అది ఎంత అసాధ్యం?

ఎంతమంచి పోపుపెట్టినా, పాత చింతకాయ పచ్చడిలోని, జాడీలో నెలలు వూరిన పరిమళం, కొత్త చింతకాయ పచ్చడికిరాదు ఆ పరిమళం ప్రత్యేకం. వందల కొలది ఏళ్ళల్లో ఏర్పడి, పోయిందిపోగా, వాటి మెరిట్ వల్లనే నిలిచిన ఈపాటలతో సరైనవి రాయడం కష్టం. ఈనాడు ఓ. వి. నరసింహారావుగారు రాసినా, వాటిని కొన్నివందల ఏళ్ళు వూరేస్తేనేగాని, పాత Wineలో వుండే Superior flavour వాటికి పట్టదు.

అందువల్ల ఇప్పుడు చెయ్యవలసిం దేమిటంటే, ఈవాంగ్మయాన్నంతా తెలుగు సారస్వతంలో కలిపెయ్యడం. దానికి అభ్యంతరం చెప్పగల గుండెవున్నవాళ్ళు ఈనాడు లేరు, దీక్షితులుగారి అనంతత కృషివల్ల. కాని, ఆవోపికా, ఉత్సాహమూ, ఆ పాటల అందానికి ఎగురుపలికిన ఆయన హృదయం, ఎవరికి వొస్తుంది, మళ్ళీ ఏ యుగానికో ఇంకో దీక్షితులు పుడితేతప్ప! పునర్జన్మ రాకండా చెయ్యాలని ఆయన ఎంత ప్రయత్నించినా ఆయనకి అది తప్పదు. ఆయనవంటివారు యుగయుగానికీ తిరిగి తిరిగి అవసరమాత్రోనే వుంటారు ఈ లోకానికి.

అరుణాచలం }
12—12—55 }

చలం



# 9

# స్త్రీల సారస్వతము

"ఏడవకు నా తండ్రి ఏడవకు తండ్రీ,
ఏడిస్తె నిన్నెవ్వ రెత్తుకుంటారు"

ఒక తెలుగు బిచ్చగత్తె చంకను జోలి వేసుకొని, శిశువు నెత్తుకొని ఇంటింటికీ తిరిగి ఈ పాట పాడుతోంది. చంకనున్న శిశువు ఒకమారు పాలు తాగుతోంది; ఒకమారు తల్లిపాట వింటోంది. కిన్నెరీకంఠముతో పాడుతున్న ఈ పాటకు ఆమె కక్కడక్కడ గుప్పెడు బియ్యము దొరుకుతున్నవి.

"ఏడవకు కుశలవుడ రామకుమార,
ఏడిస్తె నిన్నెవ్వ రెత్తుకుందూరు"

పాపము ఎత్తుకోడానికికూడా ఎవరూ లేని ఈ కుశలవులస్థితి విన్న తెనుగు తల్లు లందరికీ హృదయములో శూలము గుచ్చుకున్న ట్లయింది. ఈ పాట పాడిన తల్లి సీతాదేవి, 'సిరి గల్గు ఋషిపల్లె వీధుల పందిళ్లలో,'

"నార చీరెలతోను ఉయ్యాల వేసె,
జానకి తనయులకు జోలలు పాడె"

సంతోషముతో జోలలు పాడి కొడుకులను నిద్రపోగొట్టవలసిన సీత కంట నీరుపెట్టుకొని, గద్గదస్వరముతో పాడుతోంది. బంగారు తూగుటుయ్యాలల్లో పవళించవలసిన చక్రవర్తి కుమాళ్లు నారచీరల ఉయ్యాలల్లో పండుకొని నిద్రపోకుండా అల్లరిచేస్తూ, తల్లిచేత పాటలు పాడించుకొంటున్నారు. ఈ చిన్నపిల్లలకు కట్టుకునేటందుకు మంచిబట్టలు లేవు, నగలు లేవు, అందెలు లేవు, గజ్జెలు లేవు, పులిగోరు లేదు, ఉంగరాలు లేవు, ఉయ్యాలా లేదు. సీతాదేవి "మీ వాళ్ళందరూ అన్నివస్తువులూ మీకు తెచ్చిపెడతారు ఏడవకండి" అని కొడుకులను ఊరడిస్తోంది.

"ఏడవకు కుశలవుడ రామకుమార,
ఏడిస్తె నీ కన్నెవ్వ రెత్తుకుందూరు;
ఉంగరమ్ములు గొనుచు ఉయ్యాల గొనుచు,
ఊర్మిళా పినతల్లి వచ్చె నేడవకు;
పట్టు టంగీ గొనుచు పులిగోరు గొనుచు,
భూదేవి అమ్మమ్మ వచ్చె నేడవకు;
రావిరేకలు గొనుచు రత్నాలు గొనుచు,
లక్ష్మన్న పినతండ్రి వచ్చె నేడవకు;
ఏడవకు కుశలవుడ రామకుమార,
ఏడిస్తె నీ కన్నెవ్వ రెత్తుకుందూరు"

ఈ పాట విన్న మనకు హృదయము తరుక్కుపోతోంది.

ఈ పాట పాడిన తెలుగు బిచ్చకత్తెకు గుప్పెడు బియ్యము పెట్టి ఆదరిస్తున్నారు కొందరు ప్రజలు. ఈ ఆదరణకన్న తాను పాడే పాట, యిచ్చే అనునయము ఆమెకు అతిశయము.

ఈ పాట విన్నప్పుడు సీతా, కుశలవులూ జ్ఞాపకము రాలేదు. పామరులకూ, స్త్రీలకూ, బాలురకూ, బాలికలకూ వినియోగించు టకై పూర్వులు కూర్చిన పదములూ, యక్షగానములూ, పాటలూ, ఆటలూ — వీటిస్థితి జ్ఞాపకమువచ్చింది. ఆంధ్ర సరస్వతి ప్రజా సార స్వతాన్ని ఉద్దేశించి ఈ పాట పాడినట్లు స్ఫురించింది.

"ఏడవకు నా తల్లి ఏడవకు తల్లీ
ఏడిస్తె నీ కన్నెవ్వ రెత్తుకుందూరు"

ఒకమూల పండితుల సారస్వతము దీని పీకె నొక్కివేస్తోంది. కవిచరిత్రకారులూ, వాఙ్మయ చరిత్రకారులూ ప్రజాసారస్వతాన్ని నిరసించారు. పండితకవులు నిరసిస్తున్నారు. ఈవిధముగా ఇది నశిస్తుం దేమో అనిపిస్తోంది.

ఇంకోమూల పాశ్చాత్య నాగరీకం దీనిని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. చదువుకొన్న — అంటే ఇంగ్లీషుచదువుకొన్న — పురుషులుగా,

స్త్రీలూ ఇట్టి సారస్వతాన్ని ఆదరిస్తే, తమ నాగరికతకు ఎటువంటి భంగము వస్తుందోఅని భయపడుతున్నారు. "నేటి నాగరపు స్కూళ్ళలో జదువుకొను బాలిక లిట్టివాటిని (పాటలు మొ॥) ఎఱుగుదుగదా! వీరు తల్లు లైనపుడు తనయుల కిక నేర్పు తెలియును." ఇవి వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మాటలు.

వీరు తల్లు లైనపుడు "డిక్కరీ డికరీ డాక్" అని గాని, "జాక్ అండ్ జిల్ వెంటప్ ది హిల్" అనిగాని ఇంగ్లీషు పాటలు పాడతారని తోస్తుంది. అవేగదా బళ్ళల్లో చెప్పుచున్నది! తెలుగు పాటలకీ, పదాలకీ, యక్షగానాలకీ బళ్ళల్లో చోటు లేదుగదా. ఇంక వాటి గతి ఏమిటి? - ఆంధ్ర సరస్వతి అందుకనే జోలలు పాడుతోంది. వాటి నుద్దేశించి -

"ఏడవకు నా తల్లి ఏడవకు తల్లీ
ఏడిస్తె ని న్నెవ్వ రెత్తుకుందూరు"

ఎవ్వరూ ఎత్తుకోకుండానే కుశలవులు పెద్దవాళ్లై రాజ్యము సంపాదించుకొన్నట్లు, ఎవ్వరూ ఎత్తుకోకపోయినా ఈ సారస్వతశాఖ దినదినాభివృద్ధి జెంది, కొంతకాలానికి మళ్లీ తెలుగు హృదయాలను ఏలుకోగలుగుతుంది.

సీతాదేవి కొడుకులకు జోలపాటలు పాడి మనకు జాలి పుట్టించింది.

గోపికలు శ్రీకృష్ణుడికి లాలిపాటలు పాడుతున్నారు వినండి ఉత్సాహముతో -

"లాలనుచు పాడరమ్మా, ఈబిడ్డ లక్ష్మీవిలాసు డమ్మా
పాదమున చక్ర మమ్మా, ఈబిడ్డ వేదాంతవేద్యుడమ్మా
వేణునాదంబుతోను, ఈబిడ్డ వేదములు పాడునమ్మా"

♦ ♦ ♦

వేణునాదముతో వేదములు పాడే శ్రీకృష్ణుణ్ణి పోతన్నగారి శ్రీకృష్ణుడు ప్రక్కను కూర్చోబెట్టడానికి సందేహిస్తా రెందుకో పండితులు?

శ్రీరాముడికి లాలిపాటలు మన తల్లులు పాడుతుంటే మనము విన్నాము. మళ్ళీ విందాము –

"రామా లాలీ మేఘశ్యామా లాలీ
తామారసానయన దశరథ తనయా లాలీ
అద్దాల తొట్టెలో నీవు ఆడుకొందువు
ముద్దుపాపడంచు నిన్ను మురిసి చూచేరు"

మళ్లీ మన శైశవమందలి మాధుర్యము మనము అనుభవించి ఆనందిస్తున్నాము.

ఆదిభిక్షునై బూడిద బూసుకుతిరిగే శివునకుకూడా లాలి పాటలు పాడారు. సర్వజ్ఞుణ్ణిగూర్చి పాడిన లాలిపాట యిదిగో–

"లాలి శంకర సదా లాలితకుమారా,
లాలి పటుతాండవోల్లాస ఘనధీరా
లాలి పంచాస్య కైలాస సంచారా,
లాలి మధురాలాప లాలి గంభీరా
పతిత పావన రుద్ర ఫణిరాజభూషా,
జిత కాలకూట వర్ణిత భవ్యవేషా"

కుయ్యూరి గ్రామమందలి సీతారామదాసు వ్రాసిన పాట యిది–

"లాలి బంగరుబొమ్మ లాలి మాయమ్మ,
లాలి ముద్దులగుమ్మ లాలి సీతమ్మ"
ఇత్యాది సీత నుద్దేశించిన లాలిపాట.

"జోజో చిదానంద జోజో ముకుందా
జోజో కృపాపాంగ జో సుందరాంగ"

ఇది ముకుందునిగూర్చి. ఇంకా ఎందరెందరో దేవతలను గూర్చి, మహాపురుషులనుగూర్చి లాలిపాటలు పాడి, శైశవమందే తల్లులు తమ పిల్లలకు ఆనందమును కూర్చుతున్నారు. సత్సంగము నిస్తున్నారు. స్త్రీల సారస్వతములో జోలపాటలకు ముఖ్యస్థానము కద్దు.

రామాయణము, భారతము, భాగవతము – ఈ గ్రంథముల లోని ప్రధానవిషయము లన్నింటిమీదా పాటలు స్త్రీలు పాడు కొంటూ ఉంటారు.

పతివ్రతల వివాహగాథలు గేయరూపకముగా స్త్రీల సారస్వతమునందు విరాజిల్లుతున్నవి. సీత వివాహము, సుభద్ర కల్యాణము, ద్రౌపది వివాహము, రుక్మిణి పెండ్లి, పార్వతి పాణిగ్రహణము, శశి రేఖ పెండ్లి ఇత్యాది ఎన్నో ఉన్నవి.

"సీతాకల్యాణమహోత్సవ సమయము చూతా మురారే చెలీ" అని ముత్తైదువుల నందరినీ తీసుకొని బయలుదేరుతున్నారు స్త్రీలు. వారి వెనుకకే వెళ్ళి మనమూ చూద్దాము రండి –

"బంగారు మంటపాంతరమున, నవరత్న శృంగార పీఠమందు
రంగుగా చేమంతి విరుల, రంగుదండలు కాంతిపై
నుప్పొంగి చూడగ రఘుకుల, పుంగవుడు వేంచేసె నే డిక"–

భేరీ మృదంగ కాహళములు మ్రోగుతున్నవి. ముత్యాల హారతి నివ్వాళి యిస్తున్నారు. "కల్యాణమహోత్సవము కన్నుల చూడగా కౌతుకమగుచున్నది." "చెంగావిచీర గట్టి చెరగులు జార గను శృంగారవతు లిచ్చిరి శ్రీమణిమంగళహారతులు" "ముత్తయిదువ లందరూ ముదముతో బంతులు కూర్చుండగ పూబోణు లెల్ల భక్ష్యభోజ్యము"లు వడ్డిస్తున్నారు. సీతారాములకు నలుగులు పెట్టారు.

"నలుగిడ రారమ్మ నలినాయతాక్షికి,
చెలువు డా శ్రీరామచంద్రున కిపుడు
మృగనాభిఘనసారమిళిత గంధమున,
పసిడి నిగ్గులు గుల్కు పసుపు లందముగ
కుసుమ రజము కేల గొని కూర్మితోను"

బూజంబంతి పాటలుకూడా పాడారు.

"వింతబొమ్మలు పెట్టేవారు,
ముంతమూకుడు లుంచేవారు

మంతనంబులు దెలిపేవారు,
సంతోషంబున నవ్వేవారు
ఎంతరుచియని చెప్పేదును,
రవ్వంత చవిగొనుమని రాముడు
వింతభక్ష్యము తీసి సీతా,
కాంత కొసగెను చూడరే సఖి''

ఈవిధముగా వైభవముగా సీతారాముల వివాహమైంది.

ఈ సందర్భమున శ్రీకృష్ణుని బూజంబంతిపాట చూడండి—

"పచ్చంగ కట్టిన పందిళ్ళకింద,
శ్రీకృష్ణ కమర్చరీ బూజమ్మబంతి
తాళమేళముల సంగీతాలవారూ,
సత్యభాగవతులు తమరు కూర్చుండ్రు
తోట యాకులే పమిడి పళ్ళెములు,
వెండి గిన్నెలలోను వెలసె బూజమ్మ
రాజనాలన్నమూ కందిపప్పులునూ,
వెన్నగాచిన నేత వెలసె బూజమ్మ
అరుసై కూరలూ పిండివంటలునూ,
అమర విద్వాంసులతో అమరె బూజమ్మ"

♦ ♦ ♦

వివాహ సందర్భములలో స్త్రీలు వేడుకగా చేసే కార్యము లన్నీ దేవతల కారోపించి, వారినిగూర్చి పాటలు పాడతారు. సువ్వి పాట యిదిగో:

"సువ్వి సువ్వి రామచంద్ర సువ్వి సువ్వి కీర్తిసాంద్ర,
సువ్వి సీతమ్మ మాకు శుభము లిమ్మా;
మోదమునను పెండ్లిపీటమీద శ్రీరాము సరస
అదిలక్ష్మి యైన సీతమ్మ నునిచిరీ;
వాటమైన కుందనంపు మేటి కుందెయందు నిల్పి
గాటమైన పసిడిరోకళ్ళు బట్టుకా;

రాజనములు యిప్పపువ్వు రాజనములు మంచిపునుగు
మేలుకొండ రాజనములు మేలువంకెలూ;
కుందియందు నిండ నునిచి కొట్నమూలు దంచి రఘుడు
కుందరదన లెల్ల నవ్వుకొనుచు జెలగుచు"

ఈ విధముగానే పూలబంతుల పాటలు, గంధం పాటలు వగైరా.

స్త్రీల సారస్వతములో కరుణారస భూయిష్ఠమైన పాటలు అప్పగింతల పాటలు. ఆడపిల్లల గన్న తల్లులూ, తండ్రులూ అప్ప గింతలప్పుడు పొందే ఆవేదన ఆ పాటలలో ప్రతిబింబిస్తూ ఉంటుంది. చూడండి. జనక మహారాజుగారు తన కుమార్తె సీతమ్మని రామాదు లకు అప్పగిస్తున్నాడు. కవి కరుణారస మెట్లు ఒప్పించాడో! జన కుడు సీతను రమ్మని పిలుస్తున్నాడు.

"మామిడిపండు రావె మాణిక్యమా రావె,
మత్స్యావతారుల దేవి రావమ్మ;
గుమ్మడిపండు రావె గుణధామ రావె,
కూర్మావతారుల దేవి రావమ్మ;

♦ ♦ ♦

పనసపండు రావె బంగారు బొమ్మ,
పట్టాభిరాముల దేవి రావమ్మ
జనకుడు జానకిని తొడలపై నుంచి,
ఆనంద బాష్పములు కన్నుల నింపె..."
జనకుడు సీతకు బుద్ధులు చెప్పుతున్నాడు.
"విభుడు కోపించెనని వింత చేయకుమ,
భ్రమగల్గి ప్రాణేశు పక్కాన నుండు
విభుడు మన్నించెనని విర్రవీగకుమి,
భ్రమగల్గి ప్రాణేశు పక్కాన నుండు
రాముల చిత్తమ్ము ఎరిగుండవమ్మ,
మామీద భ్రమ తల్లి మరచుండవమ్మ;"

తరవాత పేరుపేరు వరసని దశరథాదులను పిలిచి జానకిని జనకుడు వప్పగిస్తున్నాడు. దశరథుని చేతిలో చెయి యొప్పగించిన పిమ్మట-

♦ ♦ ♦

"కైకమ్మ చేతిలో చెయి యొప్పగించి,
చేడెరో మీా సేవ చేయించుకోండి
ఆడబోయి తాను అట్టె ఉంటేను,
మెల్లగా నేర్పుతో పిలుచుకోరమ్మా
మాపట్టి గాదుసుమి మీా పట్టిసుమ్మి,
అది శాంత ఇది సీత సమముగా జూడు"

కౌసల్యకు జానకిని ఒప్పగిస్తూ తల్లిప్రేమ ఎట్లావలుకుతోందో చూడండి-

"నీ కిస్తి పాలలో ముంచెత్తివమ్మ,
పాలనే ముంచెత్తు నేత ముంచెత్తు
పాలు గాచనేరని పడతిసుమి వదెన,
నెయ్యి గాచనేరని నెలతసుమి వదెన
ఆకలని యెన్నడు అడగనేరదు,
వేళ యెరిగి పెట్టుమి ఔలది మా వదెన"

సీతను ఒప్పగించేవేళ సీత చెలికత్తె లందరూ వచ్చారు - మామూలు ప్రకారం ఆడుకోడానికి కాబోలు. అప్పుడు అన్న మాట లివి :

"మా సీత లేనుగా మీాతోటి ఆడ,
అమ్మలారా మీార లేలవచ్చెదరే;
బొమ్మరిం డ్లున్నవి బొమ్మ లున్నవి,
ఆట యెవ రాడెదరు అమ్మ మా యింట;
బొమ్మరిండ్లు గట్టి బొమ్మలను బెట్టి,
ఆట యెవ రాడెదరు అమ్మ మా యింట;

బొమ్మలకు సొమ్ములు పోరి తెమ్మనుచు,
న న్నెవ్వ రడిగెదరు నా తల్లి సీత;
ఇంట గుజ్జెనగూళ్లు అట్టె వండుచును,
అ ల్లెవ్వ రొండెదరు అమ్మ మా యింట;
ఆడుచు పాడుచు అట్టె రమ్మని,
న న్నెవరు పిలిచెదరు నాతల్లి సీత;
వేకువజామున వెలదులను బిలచి,
త ద్దెవ్వ రుండెదరు తల్లి మాయింట;
ఊగుదము రమ్మని ఉవిదలను బిలిచి,
ఇంక నూగెడివార లెవరు మాయింట;
బంతినారుబోసి మా దొడ్డినిండ,
చె ల్లెవరు వేసెదరే చేడెరో సీత''

సీతను తీసుకువెళ్ళిపోతున్నారు. తల్లిదండ్రుల ప్రాణం ఉండబట్టడంలేదు. ఒకమారు తిరిగిచూడవే అమ్మా అని సీతను పిలుస్తున్నారు.

"ముత్యాల మాణిక్య మల్లాడగాను,
ముదితరో మా సీత తిరిగిచూడావే
పచ్చల భాషికం అల్లాడగాను,
పడతిరో మా సీత తిరిగిచూడావే
నీలాల భాషికం అల్లాడగాను,
నెలతరో మా సీత తిరిగిచూడావే."

సీత వెళ్ళిపోయింది అత్తవారింటికి.

◆ ◆ ◆

సుభద్రాకల్యాణమనేపాట వేంకటకవి విజయవిలాసము ననుసరించి వ్రాసినట్లున్నది. దీనిని వ్రాసిన కవి తాళ్ళపాక తిమ్మప్ప. మచ్చుకి రెండుముక్కలు :

"ఉమ్మెత్తపువ్వువంటి ఉలికిన మడత,
సఖియలు కొని తెచ్చి నాతి కిచ్చినను"

♦ ♦ ♦

"తరళాక్షి తలపోసి అడిగె కీరమును,
ఎచ్చోట నున్నాడు ఎలమి నర్జునుడు
ఏ పుణ్యభూములకు ఏగియున్నాడు,
ఎచ్చోట తీర్థంబు లాడుచున్నాడు
అనుచు కీరము నడుగ విని అర్జునుండు,
కోమలీ యిద్దరం గోకర్ణమందు
కూడి పాడుంటిమి కొన్నాళ్లు అచట,
శయన భోజనములు ఒకచోట మాకు."

♦ ♦ ♦

స్త్రీల సారస్వతములో జననములుకూడా ప్రధానమైనవి ఉన్నవి. శ్రీకృష్ణ జననం, మేనక నోప్పులు అనగా పార్వతి జననం, రుక్మిణి వేవిళ్లు అనగా మన్మథ జననం, కుశలవుల పుట్టుక, మార్కండేయ జననం మొదలైన వెన్నో ఉన్నవి. ఇద్దరు అడుక్కునే స్త్రీలు శ్రీకృష్ణ జననం గొంతుకలు కలుపుకొని ఒకనాడు వీధిలో పాడారు. నా హృదయం హరించిన దాపాట. మొదటినుంచీ పాడమన్నాను. సగం వరకూ వచ్చునని పాడారు. మీ కేమి ఇవ్వమన్నా రన్నాను. మీ యిష్టం తండ్రీ, మే మేమైనా ముల్లె దాచామా ఏమిటి మీ దగ్గర అన్నారు. గుప్పెడు బియ్యముతో సంతోషించే హృదయము వారిది. మీ కాపాట రుచిచూపిస్తున్నాను. కాని వారి కలకంఠము, సౌకుమార్యము, జీవము ఈ అక్షరాల్లో మీరు చూచుకోండి, చూచుకోకపోయినా పాట మాధుర్యానికి లోటులేదు. ఇంక వినండి భిక్షుక స్త్రీలు మొదలు శ్రీమతులవరకూ పాడుకొనే శ్రీకృష్ణ జననం.

కస్తూరి రంగ రంగ నాయన్న కావేటి రంగ రంగ
శ్రీరంగ రంగ రంగా నిను బాసి యెట్లు నే మరచుందురా

కంసుణ్ణి సంహరింపా సద్గుకుడు అవతార మెత్తె నపుడు
దేవకీ గర్భమునను కృష్ణావతార మై జన్మించెను.

♦ ♦ ♦

ఆదివారము పూటను అష్టమీ దినమందు జన్మించెను.
నెత్తురుతో ఉండి అపుడు ఆబాల కావుకావున ఏడ్చుచు
న న్నేల ఎత్తుకొనవే నా తల్లి దేవకీ వందనంబు.
ఒళ్లెల్ల హీనంబులో ఈరీతి నున్నాను కన్నతండ్రీ
ని న్నెట్టు లెత్తుకొందు నీ వొక్క నిమిషంబు తాళురన్నా.
గంగనూ ప్రార్థించెను జలనిధులు గంగ తా నుప్పొంగెను
గంగనదిలో నప్పుడు దేవకీ జలకంబులాడె తాను.
ఇక నైన ఎత్తుకొనవే ఓతల్లి దేవకీ వందనంబు
కాని బాలునిరీతిని న న్నిట్లు ఎడబాసియుండ తగునా.
నీపుణ్యమాయె కొడకా ఇంకొక్క నిమిషంబు-తాళుమనుచు
కామధేనువు నప్పుడు దేవకి మదియందు తలచగాను
పాలవర్షము గురిసెను అప్పు డా బాలపై జల్లగానే
తడివస్త్రములు విడిచెను దేవకీ పొడివస్త్రములు కట్టెను.
పొత్తులమీద నపుడు బాలుండు చక్కగా పవళించెను
తన రెండు హస్తములతో దేవకీ బాలుణ్ణి ఎత్తుకొనెను
అద్దాలపై వేసుకు ఆ బాల చక్కదనమూ చూచెను.
వసుదేవ పుత్రు డమ్మా ఈ బిడ్డ వైకుంఠవాసు డమ్మా
నవనీతచోరు డమ్మా ఈబిడ్డ నందగోపాలు డమ్మా
సీతాకళత్రు డమ్మా ఈబిడ్డ శ్రీరామచంద్రు డమ్మా
శిరమున చింతామణి నా తండ్రి నాలుకను నక్షత్రము
పండ్లను పరసవేది భుజమందు శంఖుచక్రములు గలవు
నీ రూపు నీ చక్కన ఆ బ్రహ్మ ఎన్నాళ్ళు వ్రాసె తండ్రి''

పుట్టిన పిల్లవాడు శ్రీకృష్ణుడు అల్లరిపిల్లవాడు. ఏడవడం మొదలుపెట్టాడు. తల్లి బూచివాడనీ జోగివాడనీ, పామనీ భయ పెట్టుతుంది. నాకేమీ భయములేదంటాడు, చూడండి.

"నీ పుణ్యమాయె కొడకా నీ వాక్క నిమిషంబు తాళు రన్నా
అల్లదిగో పా మొచ్చెను నాతండ్రి గోపాల పవళించరా
పాములకు రాజువినా శేషుడు పానుపై ఉండగాను
పా నేమి చేసు నమ్మా నలినాక్షి భయము నీ కేల నమ్మా"

ఈ సందర్భములో గుమ్మడిపాట జ్ఞాపకంవస్తోంది. మనోహరమైన ఆపాట ఈ కాలాన అంతగా వినిపించడంలేదు. బాలకృష్ణుడు యశోద పెరుగు తరుస్తూంటే కుండలో చెయ్యి పెట్టపోతాడు. కుండలో గుమ్మడున్నాడు, కరుస్తాడుసుమా చెయ్యి పెట్టబోకంటుంది తల్లి. గుమ్మ డెవరే అమ్మా నే నెత్తిన అవతారాలలో ఎప్పుడూ ఆ పేరే వినలేదు అంటాడు శ్రీకృష్ణుడు.

"ఘుమ్ము ఘుమ్మున పెరుగు తరచగ,
కోరి విని ప్రార్థించి కృష్ణుడు
అమ్మ వెన్నా యనుచు కవ్వము,
నణచి పట్టగనూ
నమ్మరా కృష్ణమ్మ పెరుగులో,
నడుమ గుమ్మడు తిరుగులాడును
నమ్మకున్నను ఘుమ్ము ఘుమ్మను,
నాద మిటు వినుమీ – కృష్ణా గుమ్మ డిదుగో

♦ ♦ ♦

కాటబోయినవారి పాపడు,
కడవ లోపల చెయ్యి ముంచెను
తూటు బొడిచీ కరచె గుమ్మడు,
తొలగిపోవగనూ
మాట లేటికి విడువు కవ్వము,
అన్న నీకును వెన్న బెట్టెద
యేటికీ యిందున్న గుమ్మడు,
ఎగిరి కరచెడిని – కృష్ణా గుమ్మా డిదుగో!

తల్లి మాటలు విని శ్రీకృష్ణు డంటున్నాడు.

గుమ్మ డేడే గోపిదేవి, గుమ్మ డేడే కన్న తల్లీ
గుమ్మడిని పొడచూపగదవే,
అమ్మ గోపెమ్మా - అమ్మా గుమ్మా డేడే?
ప్రుచ్చుతనమున వేదములు గొని,
తెచ్చి వెరచుచు జలధి లోపల
జొచ్చియున్నా వాని వెంబడి, జొచ్చి జలనిధిలో
మత్స్యమై సోమకుని ద్రుంచితి,
మగుడ చదువులు బ్రహ్మ కిచ్చితి
ఆ క్షణంబున గుమ్మడనియెడి,
మాట నే నెరుగా - అమ్మా గుమ్మా డేడే?"

ఈ విధముగా పది అవతారముల గాధ చెప్పి, చివరకు నోరు తెరిచి బ్రహ్మాండమంతా తల్లికి నోట్లో చూపిస్తాడు. అప్పుడు తల్లి అంటుంది -

"కన్న బలిమిలి గుమ్మ డంటిని,
కరుణ జూడుమి దేవమణి నను
చిరుత తను వెరపించు చందము, చేస్తి నో తండ్రీ"

బాలకృష్ణుణ్ణి ఆటపాటలలో పెరగనిచ్చి, కంసవధకు తయారు కానియ్యండి.

మేనకాదేవి నొప్పులు పడుతోంది. పాపము! జగజ్జననిని కనబోతోంది. వెడదాం రండి. భయపడకండి - మేనక చెలికత్తెలు,

"వనజాక్షి ఉనికి జూచి, అలసట,
సొలసెనని మదిని గాంచి
అమ్మరో రాగదమ్మా, భుజియించ,
వమ్మ యే దిష్ట మమ్మా
వద్దనగూడ దమ్మా, వినవమ్మా,
ఎర్రావు పాలు సుమ్మా

ఎఱ్రగా గాచి రమ్మా, మా యమ్మ,
జుఱ్రవే ముద్దు గుమ్మా
సుదతి భుజియించలేకా,
నిజప్రసవ వేదనకు నిలువలేకా
నొప్పులని జెప్పలేకా, చెప్పకను,
చెలుల కను గప్పలేకా
నగపతికి జెప్ప రమ్మా, వేల్పులకు,
నగ మీాదు గట్ట రమ్మా
మగువలకు గండ మమ్మా వీలైన,
తగువారి నడుగ రమ్మా."

ఏలాగైతేనేమి చెలికత్తెలు కిందా మీాదా పడ్డారు. కష్టపడి కష్టపడి మేనక ప్రసవించింది. పార్వతి పుట్టింది. ఆమె చక్కదన మెట్లున్నదంటే –

"తమ్ములను బోలు కనులు, ముంగురులు,
తుమ్మెదల బారు మిగులు
అమ్మ యీా బాల హొయలు,
జగ మెల్ల నెమ్మదిని బ్రోవజాలూ
ముఖము వీక్షింప రమ్మా,
యీా బాల కౌమారి సొమ్ము సుమ్మ
అమ్మరో వినగ దమ్మా,
శివునికి పట్టంపురాణి సుమ్మా"

ఇక జననముల సంగతి వదిలిపెట్టి, రాయబారా లెత్తు కుందాము. శ్రీకృష్ణుడికి రుక్మిణి చిలకచేత రాయబారం పంపింది. నలుడు హంసచేత రాయబారం నడిపించాడు. రుక్మిణి చిలకచేత రాయబారం పంపడం భాగవతంలో లేదు. పాటలలో ఉంది. హంసరాయబారం భారతానికీ పాటలకీ సమానమే. రామాయణ ములో సీత రాముడికి రాయబార మంపినట్లు లేదు. కాని పాట లలో కోకిలచేత రాయబారం పంపినట్లుంది. రాయబారం ఎటువంటి

దైనా, కోకిలచేత పంపడమనేది కవి హృదయానికి తాకే విషయం. ఆ రాయబారం ఎట్టిదో రెండుముక్కలు ఉదాహరిస్తున్నాను.

"భూదేవి కూతుర్ని కోయిలారో,
జనకుని కూతుర్ని కోయిలారో
దశరథుల కోడల్ని కోయిలారో,
శాంతకు మరదల్ని కోయిలారో

♦ ♦ ♦

రాఘవుల దేవిని కోయిలారో,
నల్లనయినవారె కోయిలారో
నవ్వుచు నుందురే కోయిలారో,
శ్రీరామచంద్రులే కోయిలారో;

♦ ♦ ♦

భర్తను విడిచుంటి కోయిలారో,
ఆహారనిద్ర లేకుంటి కోయిలారో
రాము రమ్మని చెప్పు కోయిలారో,
మెడని హారం యిస్తు కోయిలారో
ప్రాణేశు తోడ్తెమ్ము కోయిలారో,
పక్షి చేసిన పనులు కోయిలారో
ఉపకారమై యుండు కోయిలారో."

♦ ♦ ♦

స్త్రీల సారస్వతములో రామాయణకథ ఎన్నివిధాలుగా నడిపించటానికి వీలుగా ఉందో అన్నివిధాలా నడిపించారు. ఈ క్రింది రామాయణం ఎత్తుగడ చూడండి – ఈ పాటకు శ్రీరామ దండములని పేరు.

పాలసముద్రంమీద పవళించు రామ,
శేషునిపయి నిద్ర సేవించు రామ
వటపత్రశాయినై పవళించు రామ,
శ్రీలక్ష్మికి స్థిరంబుగనుండు రామ

దండాము దండాము
దండాము కోదండ పతివైన రామ,
దండకారణ్యాన చరియించిన రామ
దండిగా నసురుల చెండిన రామ,
దయతోటి మమ్మేలు దశరథ రామా
దండాము దండాము.

ఈ విధముగా రామాయణకథ అంతా చెప్పబడ్డది.

ఉత్తర రామాయణమునకు సంబంధించిన కుశలవుల కథ అనేక విధములుగా గేయరూపముగా చిత్రింపబడ్డది. కుశలవుల యుద్ధమనీ, కుశలవ కుచ్చెల చరిత్రలనీ, కుశలాయకమనీ మూడు పెద్ద పాటలు గలవు. అందు కుశలాయకములో రామచంద్ర రాజును కవి ఈ విధముగా తన భాషనుగురించి చెప్పుకొంటున్నాడు.

పరగ మూఢులకైన బాగుగా తెలియగా,
అతివేడుకపుమాట లన్ని యుంచెదను
పదగుంభనము ఛాయ పరగజాల నటంచు,
గేలిశాయగ మీకు వీలుకాదయ్య
కఠినంబు లుంచితే కాపులకు తెలియదని,
ముసుగు లుంచుట మాని మాట లుంచితిని."

అపరిమిత ప్రయోజనము కలదనీ, అందరికీ అందుబాటులో ఉంటుందనీ వ్యవహారభాష వాడమని చెప్పేది యిందుకనే.

ఈ చిన్న వ్యాసములో ఈ పెద్ద కథలనుగురించి చెప్పడం వల్ల గ్రంథం పెరిగిపోతుందని వదిలివేస్తున్నాను. కాని కుశలవ కుచ్చెల చరిత్రలో ఒక వింతకథపట్టు ఉంది. దానినిమాత్రం చూపుతాను. దశరథుడు కైకమ్మ యింటికి వచ్చాడు. అతానికి ఆవిడ ఎంత చెప్పితే అంత. జంతుజాలముకూడా ఈ సంగతి గ్రహించింది. తలంటి నీళ్ళు పొయ్యడానికి కైకమ్మ పీటవేసి దశరథుణ్ణి కూర్చోబెట్టింది.

"పీటకు కోళ్ళు మూడే ఆనె,
నాలుగో కోటను చీమలబారు
వెళ్ళుతుండగా చీమల రాజు,
సేనతో చెప్పెను చోద్యముగాను
సపరివారము చక్కగ వినుడి,
పెక్క మక్కువతో చక్కని సతిచే
జిక్కి రాజు మోహంపడియు,
అభ్యంగనము అమరగ చేసె
కళ్ళ జూడడు కరుణయు లేదు,
చత్తుమొ? పుత్తుమొ? కడతేరుదుమొ?
కోడు వదలి ఈ కొనసే రండి"

ఆ విధంగా చీమల రాజు పరివారాన్ని నడిపించుతూ వెళ్ళి పోయాడు. రాజుకు చీమలభాష తెలుసు. తెలిసినా కైకకు దాసుడే. మరిన్నీ ఒక చీంబోతు ఒక మేకను ఒక కోరిక కోరింది. ఆ మేక అందిగదా – పది నిల్వుల బావిలో పచ్చని పూరి ఉన్నది, అది తెస్తే కోరిక చెల్లిస్తా-నని. అప్పుడు చీంబో తంటోంది –

పూరికి పోయి చావగ నేలా,
భువిలో ప్రాణము ఒడలిని ఉంటే
బలుసుకూర దిని బ్రతుకగవచ్చు,
శిరస్సుపైని శిగ ఉంటేను
పట్టెడు పువ్వులు చుట్టగవచ్చు,
వెర్రివాడు రారాజు గనుకను
భార్య మాటలకు భ్రమసీ రాజు,
అర్థం ప్రాణం ఆలికి నిచ్చె"

అంటూ రాజును ఈసడిస్తుంది. దశరథుడి కీమాటలు తెలిసినా లాభం లేకపోయింది.

♦ ♦ ♦

సీతమ్మ ఒకనాడు రామునిపై అలిగింది. అలిగి కోపగృహ ములో పడుకొన్నది. రోజులు గడచిపోతున్నవి. మాసములు

గడచిపోతున్నవి. అలక తీర్చేవా రెవరూ దొరకడంలేదు. పెంపుడు చిలకను రాముడు సీతదగ్గిరికి రాయబారం పంపుతాడు. పంపుతూ అంటున్నాడు-

"చిలకరో ఓ చిలక మా రామచిలక,
ఎర్రని ముక్కుకు వెండి పొదిగిస్తు
పచ్చని రెక్కలకు పయిడి పూయిస్తు,
నీవు పోయెడి త్రోవ సెలగ వేయింతు
సెలగ దిని చెయి కడగ చెలమ తీయింతు,
నీరు త్రాగి నిలుచుండ నిమ్మ వేయింతు
అలసిపోయి కూర్చుండ అరుగు వేయింతు"

ఇవన్నీ చేస్తాను, సీత అలక తీర్చమని పంపుతాడు. చిలక వెడుతుంది. చిలకను చూచి సీత, వదరకే, పోవే, లేకుంటే తల పగలగొడతానని బెదిరిస్తుంది. భయపడి చిలక పారిపోతుంది. చివరకు ఎలాగైతేనేమి చిలకే అలక తీర్చింది. లక్ష్మన్న సలహామీద చిలక సీతదగ్గిరికి వెళ్ళి, ఆమెకు వినబడేటట్టు "ఆరు నెలలబట్టి సీతఅలిగి కూర్చుండడంవల్ల రామునికి స్వస్థత తప్పింది పాపం" అంటుంది. ఆ మాట వినగానే సీత భయపడి, దిగ్గున లేచి, రాముడిదగ్గిరికి పరుగెత్తుకు వెడుతుంది.

♦ ♦ ♦

శ్రీరాముడు హనుమంతుణ్ణి సీతదగ్గిరికి పంపుతూ ఆనవాళ్ళెన్నో చెప్పుతున్నాడు. ఈ పాటలో చెప్పిన ఆనవాళ్ళు చాలా మట్టుకు మూలములో లేనివి. అందులో ఒక ఆనవాలు వినండి:

మరి ఒక ఆనవాలు కలదురుమ హనుమా,
మరువక చెప్పుమా మా సీతకో నూ
కొత్తగా కట్టిన మేడ లోపలను,
శ్రీరాములు సీత మాట్లాడుచుండె
నాకు ప్రొద్దుపోదు నలినాయతాక్షి,
సొగటాలు ఆడుదామని సీత నడిగె

బంగారు పాచికలు పట్టుకొని వచ్చి,
తిత్తికి తీదుంచమిధి చక్కఁభారా
అష్టారదష్టోక అది భారయనుచు,
సరియనుచు దుగయనుచు పారివేయుచును
మాట మాటకు సీత రాము నోడించె,
ఇంత యోడింతురా ఇందీవరాక్షి ?
సీతమీద కోపించి శ్రీరాఘువ్రాలు,
పట్టుశాల్వ ముసుగుపెట్టుకొనె నంత
తప్పుగలదూ దేవ ధరణీశ్వరూడ,
అని పద్మనాభుని పాదములు మ్రొక్కి
నవ్వుతూ లేచెనే నారాయణుండు,
యిది ఒక ఆనవాలని జెప్పు హనుమా"

♦ ♦ ♦

ఇక సీత అగ్నిప్రవేశం అనేపాట ఎత్తుగడ పరికించండి :

"సీతాంగ ననియేటి పరమపతివ్రతకూ,
చిత్రించి కట్టిరే చిరి పర్ణశాల
అమర్చి కట్టిరే అడిదంపుశాల,
ఆ పర్ణశాలకు పచ్చలా తలుపు
తలుపు తీయగ నుండె బంగారు గద్దె,
శృంగార గద్దెపయి చిటిచాప బరిచి
సీతయు రాముండు జూదమాడంగ"

అప్పుడు పైడిలేడి వచ్చింది. దానిని సీత చూచి తెమ్మన్నది-

"లేడి వెంబడి నేగె దశరథాసుతుడు,
పుడకలు కొరుకుతూ పూరి మేయుచును
ఆకులు కొరుకుతూ గంతులేయుచును,
చంగునా దాటుతూ చౌకలించుచును
అడవు లన్నీ తిరిగి అలసటను చెంది"

చివరకు రామబాణముచేత హతమయింది. ఈ విధంగా అగ్నిప్రవేశంవరకూ రామాయణకథ నడిచింది. సీత అగ్నిప్రవేశం చెయ్యడానికి హనుమంతుడు చితి పేర్చాడు. అడవిలో చెట్లన్నీ పీక్కువచ్చి పెద్ద చితి పేర్చాడు. ఆ చితిమీద నెయ్యిపోశారు.

"భగభగ మంటలతో పావకుడు వెలుగ,
వచ్చిరీ వానరులు వైదేహి కడకు
రామచంద్రుని సతీ లక్ష్మణుని వదినె,
అగ్నిగుండానికే వేంచేయవమ్మా
కౌసల్య కోడలా కడు బుద్ధిశాలి,
అగ్నిగుండానికే వేంచాయవమ్మా
భూదేవి కూతురా భూలోక మాత,
అగ్నిగుండానికే వేంచేయవమ్మా"

అని యిట్లు వానరులు పిలువగా, సీతమ్మ తొలకరి మెరుపు వలె వచ్చింది. ఆమె రాకను చూచి లక్ష్మణుడు గడగడ వణకినాడు. అతన్ని చూచి సీత అంటోంది.

"అడలకుమి లక్ష్మణా జడుపేల నిపుడు,
మి మ్మన్నమాటలు అనుభవంబయ్యె
చేసినపాపమ్ము వండిన చద్ది,
కుడువకపోదయ్య కొంతకాలముకు"

అని లక్ష్మణుణ్ణి ఊరడించి సీత ప్రతిజ్ఞ చేస్తోంది వినండి ఆ పతివ్రత ప్రతిజ్ఞ-

"అగ్ని జొచ్చి నేను ఓడితినయినా,
ఇంకును జలనిధులు ఇలనుండబోవు
అగ్నిజొచ్చి నేను ఓడితినయినా,
నెల మూడువర్షాలు కురవ వెన్నటికి
అగ్నిజొచ్చి నేను ఓడితినయినా,
శ్రీరాము సతి గాను నేను లక్ష్మణుడ

అగ్ని జొచ్చి నేను ఓడితినయినా,
భూలోకమాత నగుఈ పృథివియందు''

ఈ ప్రతిజ్ఞ విని బ్రహ్మరుద్రాదులు హడలిపోయారు. భూమి గడగడ వణికింది. ఆకాశ మదిరింది, దశదిక్కులూ కంపించినవి. పిమ్మట సీతాదేవి అగ్నిగుండాని కెదురుగా నిలబడి –

''గుండమున కెదురుగా సీత ఏతెంచి,
ముమ్మారు ప్రదక్షణం చేసి నిలుచుండె
దోసెడు ముత్యాలు గుండాన బోసి,
ముందు శ్రీ రాములను హృదయాన దలచి
వెయికోట్ల జన్మములు ఎత్తినా గాని,
గోవిందుడే నాకు పతిగ గావలెను
పదివేల జన్మములు ఎత్తినా గాని,
లక్ష్మణుండే నాకు మరిది గావలయు''

♦ ♦ ♦

ఈ విధంగా తన కోర్కెలు చెప్పి
"అని పల్కి అగ్నికి వందనంచేసి,
కొలను జొచ్చినట్లు అగ్నిలోజొచ్చె.''

అప్పుడు జరిగిన వింత చూడండి.

''కుప్పల నిప్పులూ కుంకమ్మ లాయె,
పరిచిన నిప్పులూ పన్నీరు ఆయె
దాపిన నిప్పులూ చందనం బాయె,
మండే నిప్పులూ వడగళ్లు ఆయె
చిలకలూ కోవిలలు హంసలూ గుమిగ,
సీతకు తోడుగా కొల నాడుచుండె''

ఇ దేమి చోద్యమని లక్ష్మణుడు రామునితో ననగా, రాముడి కింకా నమ్మకం కలగక అంటున్నాడు–

"ఆడవారికి గలవు అగ్నిమంత్రములు,
అలికేరు తుడిచేరు ముగ్గుపెట్టేరు
మండేటి మంటలకు మాసు మసిలేసు"

అని అంటే అగ్నిహోత్రుడికే కోపం వచ్చింది. భూదేవికి కోపం వచ్చింది. సీతను ఏలకుంటే లోకాలు నశించిపోత వన్నారు. ఆకాశవాణికూడా పలికింది. రాముని సందేహం తీరింది. అప్పుడు-

"దుందుభులు మ్రోగెను తుంబురుడు పాడె,
రంభ ఊర్వసు లపుడు నాట్యములు చేసె
పుష్పవర్షము కురిసె పృథివిపై నపుడు,
సీతను భూదేవి శీఘ్రముగ ఎత్తి
శ్రీరాము తొడలపై సీతనే ఉంచె."

♦ ♦ ♦

రామాయణానికి సంబంధించిన గాథ లెన్నో పాటలుగా ఉన్నవి. అందు కొన్ని పాటలే యిందు మచ్చు చూపించాను. అచ్చుపడ్డవి కొన్నిమాత్రమే ఉన్నవి. అచ్చుపడనివి అనేకమున్నవి. అచ్చుపడ్డ ఒక పాటనుండి ఒకవిషయమును చెప్పి, రామాయణ గాథలు కట్టిపెట్టుతాను. ఆ పాటపేరు లక్ష్మణదేవర నవ్వు. శత్రు విజయము అయిన వెనుక, శ్రీరాముడు సోదరులతో, బంధువులతో, సామంతులతో, సేనలతో కొలువుదీరి ఉన్నాడు. లక్ష్మణునకు బద్ధకం వచ్చింది. కునుకు వచ్చింది. సభలో అతడు నవ్వాడు. ఆ నవ్వు అందరూ చూచారు. ఎవరిమట్టుకు వారు తనను చూచి లక్ష్మణుడు నవ్వాడని అనుకొన్నారు. జాలారికన్నెను తలమీద ధరించినానని కాబోలు నవ్వుతున్నాడని శివు డనుకొన్నాడు. దశకంఠునింట నుంటినని కాబోలు యీ నవ్వు అని సీత అనుకొన్నది. రాముడికి కోపం వచ్చి ఖడ్గం తీసి తల నరకబోయాడు. లక్ష్మణుడు నవ్వుకు కారణం చెప్పాడు: అడవులలో రామునితో పాటు సంచారం చేసేటప్పుడు లక్ష్మణస్వామికి నిద్రాదేవి దర్శనమిచ్చింది. "నేను రామసేవ చేయవలసి ఉన్నది. ఇప్పుడు నన్ను ఆవహించకు.

నాభార్య ఊర్మిళపురములో ఉన్నది. ఆవిడను పూర్తిగా నీవు ఆవహించు; నన్ను వదిలిపెట్టు. వనవాసమైన తరవాత ఆవహింతువు గానిలే నన్ను" అన్నాడు. నిద్రాదేవి వప్పుకుంది. వనవాసమైనది. ఇంటికి అందరూ వచ్చారు. రాముడు సభతీర్చి ఉన్నాడు. ఇప్పుడు నిద్రాదేవి లక్ష్మణున్ని సభలో పట్టుకొంది. జరిగినసంగతి జ్ఞాపకం చేసుకొని లక్ష్మణుడు నవ్వాడు. రాముడీ సమాచారం విని శాంతిం చాడు. చెప్పదలచుకొన్న విషయం ఏమిటీ అంటే బంధువులతో, మిత్రులతో, పరివారముతో రాముడు విందు నారగించ దలచాడు. అరనై కూరలూ, పచ్చళ్ళూ, పిండివంటలూ సమస్తమూ వడ్డిం చారు. అంతా భోజనానికి కూర్చున్నారు. కాని ఒక పొరపాటు వచ్చింది. మొదటనుంచి చివరవరకూ హనుమంతుడు పడ్డ కష్టమూ, చేసిన సేవా యింతా అంతా కాదు. ఇంట్లో ఏమి కావలసినా హను మంతుడే యివ్వాలి. ఎవరికి ఏ వర్తమానం తీసుకుపోవలసివచ్చినా హనుమంతుడే తీసుకుపోవాలి. ఏ చాకిరీ చేయవలసివచ్చినా హను మంతుడే చేయాలి. ఇటువంటి హనుమంతుణ్ణి ఆదినము పంక్తిభోజ నానికి పిలవడం మరిచారు. మిగిలిన కథ హాస్యరసము పోషిస్తూ కవి చెప్పుతున్నాడు వినండి –

"ఆనాడు లంకలో ముచ్చటాలన్నీ,
చెప్పుకొనుచు వారు భుజింపుచుండ్రి
ఆనాడు రావణుని ముచ్చటాలన్నీ,
చెప్పుకొనుచు వారు భుజింపుచుండ్రి
అప్పుడూ హనుమను మరచి ఉండిరి,
పులుతుపులుతూమని వచ్చె హనుమాను
ఇంటివాడవుగనుక ఊరుకుంటిమి,
పొత్తునా కూర్చొమ్మి ఉత్తమా పురుష
నీవుండగాగదా సీత దెచ్చుకొని,
అయోధ్యపట్నమ్ము ఏలగలిగితినీ
నీ వుండగా గదా తమ్ముల పంక్తి,

భుజియింప గలిగితిని హనుమన్న వినుమ
పొత్తునా కూర్చొమ్మి ఉత్తమా పురుష."

హనుమంతుడికి కోపంవచ్చింది. సర్ది చెప్పతేమాత్రం కోపం తీరుతుందా. రామభక్తికి కోపం రాకూడదు. కోపం తీర్చుకోవాలి. మానవజన్మ ఎత్తి ఉంటే కోపం ఎలాగ తీర్చుకొనేవాడో. ఎత్తింది కోతిజన్మగనుక, కోపం ఎట్లా తీర్చుకొన్నాడంటే – "పొత్తునా గూర్చుండ ఉత్తముడ గాను'' అని సమాధానంచెప్పి, రాముడి ప్రసాదం భక్తుడు తాను అనుభవింపవలెను కాబట్టి,

సర్వేశు భోజనం తా గాగ చూచి,
ముందార పళ్లెమ్ము ఎత్తుకొని పోయె
తా బోయి హనుమన్న అవిసిచెట్టెక్కె,
ద్వాదశికి ఒక ముద్ద కొమ్మపై నుంచె
అందుమీద పళ్ళెమ్ము అంది పడవేసె''

శ్రీరాముడు లేచి వెళ్ళి అవిసిచెట్టు మొదట నిలబడి హనుమన్నని బతిమాలుతున్నాడు,

"వృక్షమున కెదురుగా రామచంద్రులు,
చెయిజాచి హనుమన్న రమ్మనిపిలచె''

అప్పటికి హనుమన్న కోపంపోయింది. రాముడు పిలుస్తే రాకుండా ఉండగలడా ఆ పరమభక్తుడు? రాముడు చెయి చాసి రమ్మంటే,

"రామచిలకావలెను చేతిపయి వ్రాలె,
చేతిపై హనుమన్న ధరణిపై దించ
ముత్యాలహారమ్ము మెచ్చి మెడవేసె''

హారము మెడలో పడ్డంతోనే హనుమన్న యథాప్రకారం రాముడి నోట్లో నాలికైనాడు.

* * *

మహాభారతానికి సంబంధించిన కథలు చాలా ఉన్నవి. ప్రశస్తమైన పాట ధర్మరాజు జూదము. కీచకవధ ఇంకొకపాట.

రెండున్నూ రసవంతముగానే ఉన్నవి. స్త్రీల వాఙ్మయమున కవి భూషలవలె నున్నవి. గ్రంథవిస్తరమునకు వెరచి, వాటిని వదిలి వేస్తున్నాను.

*　　　　*　　　　*

ఇక యితర కథలగురించి కొంచెం చెబుతాను. స్త్రీల సారస్వతములో సారంగధర చరిత్రపాటలు రెండున్నవి. ఒక్కటి చాలా పెద్దది. వెంకటకవి కావ్యముకన్న పెద్దది. రెండవది చిన్నది. రెండున్నూ వెంకటకవి కావ్యానికి భిన్నముగానే ఉన్నవి. వెంకట కవి మతములో చిత్రాంగి రోవెలది. పాటలలో చిత్రాంగి రాజు రెండవభార్య. పెద్ద పాటనుగురించి చెప్పడం వదలిపెట్టి, చిన్న పాటను గురించి కొద్దిగా మనవిచేస్తాను.

స్త్రీల సారస్వతములో ఒక విశేషం ఏమిటీ అంటే, చెప్ప దలచుకొన్న విషయం సూటిగా హృదయానికి తగిలేటట్లు చెప్ప డమే. అందువల్లనే రసము చిలుకుతూ ఉంటవవి. అఖండ కావ్యాలు చేద్దామనిగాని, అర్థము చేసుకోలేని కావ్యా లల్లుదామని గాని వారు తలపెట్టకు. అందుకనే ఆ కవులు అనవసరము లగు వర్ణనకు తావియ్యరు. ప్రబంధలక్షణములను ఎదుట బెట్టుకొని, వర వడి దిద్దుకొనే ప్రబంధకవుల కావ్యాలకంటె సహజమై, సెలయేళ్ళ వలె ప్రవహించే ఈ పాటలలోనే గుణము అతిశయముగా ఉన్నది. కొద్దిగ్రంథములను వదిలిపెట్టి, పండిత సారస్వతాన్ని స్త్రీల సార స్వతములో పోల్చి నిష్పక్షపాతముగా చూస్తే, స్త్రీల సారస్వతమే గుణబాహుళ్యము కలదిగా కనబడుతుంది. సారంగధర చరిత్ర పాట ఎత్తుగడ ఎంతసూటిగా ఉన్నదో పరికించండి. శివుని వరప్రసాద మున సారంగధరుడు కలిగినాడని చెప్పబోతున్నాడు కవి :

"పర్వతాల మల్లన్న భమిడి మేడల మీాద,
మెరిసెంచె జోగిరూపు
పులితోలు వస్త్రమ్ము పునుక గణముల పేరు,
చంక జోలెయు కట్టుకు

ముఖమునా వీబూధి మెడనిండ రుద్రాక్ష,
తావళంబులు మెరయగా
బంగారు కిన్నెరా రత్నంపు మెట్లాది,
వాయింపు చుండగాను
కిన్నెరా నాదముకు కిటికీలు తెరచుకొని,
రత్నాంగి పారజూచె
ఈశ్వరా నీవంటి పుత్రునీ ఇమ్మని,
శంభుణ్ణి తా గోరెను
రత్నాంగి కోరిక రంజిల్లు నట్లుగా,
రజతాచలేశు డిచ్చె''

ఈ విషయమునే ప్రబంధమర్యాదను పండితకవి చెప్పవలసి వస్తే అధమపక్షం రెండాశ్వాసాలైనా వ్రాసి ఉంటాడు. ఇక కథ. సారంగధరుడు చిత్రాంగి మేడకు పావురముకొరకై వెళ్ళాడు.

''బాల రాకలు చూచి పణతి తా నెదురుకొని,
యేక నివ్వాళు లిచ్చె
అమ్మ కట్నం బివ్వ అన్యులమా మేము,
అమ్మ నీ సుతుడ గాదా
ఆకలితో ఉంటివో అన్నమ్ము వడ్డిస్తు,
ఆరగించుము అల్లుడా
ఆకలయినా లేదు అన్నము నా కొద్దు,
అమ్మ నా పక్షి నిమ్మా
అమ్మన్న నోటికి కమ్మని ఖజ్జాలు,
కాముడా నే బెడుదును''

సారంగధరుడు చిత్రాంగికి వశుడుగాక తప్పించుకు పోబోతాడు. అప్పుడు చిత్రాంగి అంటుంది.

''కాముడా నీ వింత కఠినంబు జేస్తివి,
కాంతునకు నే జెల్పుదు

కట్టిస్తు కొట్టిస్తు కాల్పిస్తు నిన్నయిన,
కండలే గోయిస్తును".

కథ అంతా ఈ విధంగా రసవంతంగా నడిపించాడు కవి. సారంగధరుడు బ్రతికి ఉన్నాడని రత్నాంగి విన్నప్పుడు తల్లిని కవి ఒక్కమాటలో ఎట్లా చిత్రించాడో!

"ఫణిహార్లు డెచ్చినా, పలుకులూ వినగానె,
పణతికీ పాలు గురిసె"

♦ ♦ ♦

అనంతామాత్యుడు వ్రాసిన భోజరాజీయములో కామధేనువుకథ ఉన్నది. తెలుగువారికీ,కన్నడులకూ ఈ కథ అభిమానకథ. అనంతామాత్యుడు గోవు కథ విరివిగా రసవంతముగా వ్రాశాడు. స్త్రీల సారస్వతములో గోవుపాట అనే పేరుగల ఈ కథే అంత విరివిగా కాకున్నా రసవంతముగా వర్ణింపబడ్డది. శ్రీకృష్ణుడు పాలు పితకడానికి గోవుల్ని పేరు పేరున పిలుస్తున్నాడు. పండిత సారస్వతములో మనుచరిత్ర, శృంగార శాకుంతలము మున్నగు గ్రంథములలో వేటకుక్కలకు పేర్లున్నవి. స్త్రీల సారస్వతములో పోతన భాగవతములో గోవులకు పేర్లున్నవి. శ్రీకృష్ణుడు పిలుస్తున్నాడు ఆలకించండి.

"పెద్దకాలవు ఆవులారా, పేరుపడ్డ మందలారా
కపిలయావు దూడలారా, కర్రియావు దూడ రావె
తెల్లయావుపిల్ల రావె, బొల్లియావు నీవు రావె
కామధేనువ కల్పతరువా, శ్రీలక్ష్మి పేరిందేవి
అన్నపూర్ణ విశాలాక్షి, తెల్లమచ్చా గోవు రావె
నల్లమచ్చా ఆవు రావె, చిన్నఆవుదూడ రావె"

పిలిస్తే ఆవులన్నీ వచ్చినవి. వచ్చిన గోవులన్నిటినీ పాలుపిదికి యింటికి పంపివేసి తాను చెట్టెక్కి వేణు వూదుకుంటున్నాడు. గోవులన్నీ మేతకు పోయినవి. అవి మేస్తుంటే,

"గొప్పనాదము చెవుల బడగా, అదరుకొంటూ
బెదరుకొంటూ
మేతమాని ఎదురు చూడగ, గాండ్రు గాండ్రు
మనుచు వేగమె
పెద్దపులి ఒక టొచ్చి నిలిచి"

నా పొలములో మీరు వచ్చి మేస్తున్నారు. పారిపోకండి అంటూ పెద్దపులి,

"దాటిపోవా జూతురేమొ, పారిపోవా జూతురేమొ
కురుచ కొమ్ముల చిన్నఆవుల, నిడుపు కొమ్ముల పెద్దఆవుల
పేరుపడ్డా ఆవులాను, కోట్లకొద్దిగ తిన్నదానను"

అని వాటితో చెప్పి భయపెడుతుంది. మిగిలిన ఆవులను వెంటబెట్టుకొని ముసలిఆవు ముందుకు వచ్చి పెద్దపులితో చెప్పుతుంది.

"ఒక్క మనవి చిత్తగించు మూడు దినములకింద నేను
కవల దూడల కన్నదానను, నన్ను పెంచిన దాత లెల్లా
పాలు పిదుకకయుండగాను, రెండుదూడల పెంచుచుంటిని
నాదు రాకకు దూడ లెల్లా, ఎదురు చూచును బెంగతోను
శెలవుయిచ్చిన పాలు యిచ్చి, మళ్ళివచ్చి నీదు యాకలి
తీర్తు ననుచు బల్కగాను"

ఎన్నో ఒట్లు పెట్టుకొన్న మీదట పెద్దపులి "జాలిగలిగి" వెళ్ళి రమ్మంది, ఆవు దూడల దగ్గిరికి వచ్చి పాలిచ్చి బుద్ధులు చెప్పుతోంది.

బుద్ధిగలిగి మసలుచుండుడీ, పచ్చిచేనులో మేయబోకా
కాపుచేతిలో చిక్కబోకా, పొదల చాటున మేయబోకా
పులుల నోటి కందబోకా, ఇండ్లలోన తిరుగబోకా"

కడుపునిండా కసవుతిని దొడ్లో నిద్రపొండని చెప్పింది. పిమ్మట మందలో ఆవుల్ని పిలిచి వాటికి తన దూడల్ని అప్పజెప్పుతోంది.

"పేరిందేవి మీనాక్షి, ఆదిలక్ష్మి అన్నపూర్ణా
కామధేనూ కల్పతరువా, పేరుపడ్డా గోవులారా

నాదు కొడుకుల మీారు జూచి, ముందుకొచ్చిన
పోడువబోకా
వెనుక కొచ్చిన తన్న బోకా, మందజేస్చుక బుద్ధిగరవుఁడి"

అని తాను పెద్దపులిదగ్గిరికి వెడుతుంది. దానిని గట్టిగా పిలుస్తుంది. పులి గోవును మెచ్చుకొని వదిలి పెడుతుంది.

స్త్రీల సారస్వతములో ప్రధానస్థాన మాక్రమించే చిల్లరిపాటలనేక మున్నవి - మంగళహారతులు, మేలుకొలుపులు, కోలాటం పాటలు, గొబ్బిపాటలు, పారువేట పదాలు, విసురురాతి పదాలు, దంపుళ్ళపాటలు, తుమ్మెదపదాలు, పిల్లల నాడించేపాటలు మొదలైనవి.

ఈ వ్యాసములో ఎత్తుకొని పెద్దపాటలుకూడా చాలా ఉన్నవి- తులసీ మాహాత్మ్యమనే తులాభారము, ఊర్మిళ నిద్ర, శ్రీకృష్ణుని చల్దులు, పందుపాట, వేదాంత కుచ్చెల కథ, లక్ష్మణ మూర్ఛ, లంకాయాగము, సీత సురటి, సవతుల కయ్యము (పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు గంగా గౌరీసంవాద మనేపాటమీాద మంచి వ్యాసమువ్రాసి ప్రకటించి ఉన్నారు) పారిజాత పల్లవి, కుచేలోపాఖ్యానము, చెంచీతపాట, శాంతగోవిందనామములు, గోపికల జలక్రీడలు, గుహ భరతుల అగ్నిప్రవేశం మొదలైన వెన్నో ఉన్నవి. ఏలూరిలో నందిరాజు చలపతిరావుగారు, కాకినాడలో మంగు వెంకట రంగనాథరావుగారు చాలాపాటల నుద్ధరించి అచ్చువేశారు. ఇప్పు డక్కడక్కడ కొద్దిమంది అచ్చువేస్తున్నారు. అచ్చుపడనివి చాలా ఉన్నవి. బిచ్చగాళ్ళ నోళ్లల్లో ఎన్నో ఇంకా ఆడుతున్నవి. మన తల్లుల నోళ్లల్లో కొన్ని ఆడుతున్నవి. వీటి నుద్ధరించవలసి ఉన్నది. స్త్రీల సారస్వతానికి ప్రాముఖ్యము రావలసి ఉన్నది, దీనితోపాటు బాలుర సారస్వతానికీ, పామరుల సారస్వతానికీకూడా ప్రాముఖ్యము రావలసి ఉన్నది. ఇప్పటి కవులచరిత్రలూ వాఙ్మయచరిత్రలూ సంపూర్ణముకావు. ఆంధ్రదేశములో పుట్టి పెరిగి ప్రచారములోనున్న ప్రతిసారస్వత

శాఖకూ కవుల చరిత్రలో స్థానమున్నప్పుడే అది సంపూర్ణ మని పించుకుంటుంది. లేనినాడు కాదు. స్త్రీల సారస్వతములో భాష జీవద్భాష. అందరికీ తెలిసేది. హృదయానికి గుచ్చుకొనేది. సహజము కాబట్టి సుందరమైనది. వ్యాకరణాని కిది బానిస కాదు. ఇదే వ్యాకరణాన్ని బానిసగా చేసుకోకలదు.

ఇందలి ఛందస్సు వేర్వేరుగతులుగా ఉంటుంది. పదకవిత్వ మని తిట్టేవారు తిట్టుకోవచ్చు. పద్యముగాని పాటగాని ఒక సాధ నమే అవుతుంది. నిర్దుష్టముగా పద్యము చెప్పినంతమాత్రాన కవిత్వ మూడిపడదు. దుష్టముగా పాట వ్రాసినట్లూహించినంత మాత్రాన కవిత్వము కొఅవడదు. స్వారస్యము పోదు. ఈ పాట లెక్కువగా ద్విపదవలె నుంటవి. ప్రాస ఉంటే ఉండవచ్చు. యతులు పడ్డచోట పడతవి. గణములలో ఒక్కొక్క మాత్ర తగ్గ వచ్చు, హెచ్చవచ్చు. ఛందస్సుకుగాని, వ్యాకరణానికిగాని కవి బానిసకాడు. వీటిని వెనక్కి నెట్టివేసె కవి తన భావాన్ని హృద యాన్ని దూసుకుపోయేటట్లు వదులుతాడు.

మన దేశములో కళవలెనే కావ్యమున్నూ నిత్యజీవితాన్ని ఆక్రమించి అలముకొంది. కట్టు, బొట్టు, జుట్టు, గుమ్మము, గోడ, పీట, అరుగు, ఇంటికప్పు, పాత్రలు, ఆభరణాలు — అంతటా కళ ప్రవేశించింది. కూలిపనికి, పడవలాగుటకు, దంపుళ్ళకు, పిండి విసరడాలకు, ఆటలకు, అన్నిటికీ కవిత్వమూత ఇస్తోంది. పండిత సారస్వతానికి ప్రజాసారస్వతాని కున్నట్లు నిత్యజీవనాన్ని అలముకొనే శక్తి లేదు. కన్ను తెరిచి చూచేవారికి స్పష్టము. ఇట్టి సారస్వతాన్ని నిరసించే పండితులు చిన్నప్పుడు తల్లుల పాటలకు పులకరించినవారే. రాజావలంబనంవల్లనే పండితసారస్వతం వృద్ధి చెందింది. ప్రజాసారస్వతము ప్రజావలంబనంవల్ల వృద్ధిజెందక తప్పదు.

ఇక చిల్లరపాటల గురించి కొద్దిగా వ్రాసి విరమిస్తున్నాను.

మేలుకొలుపులు జోలపాటలకువలెనే హృదయమును హరింప శక్తిగలవి.

> "బంగారు చెంబుతో పన్నీరు పట్టుకొని, పణతి రుక్మిణి
> వచ్చె మేలుకో"

ఈవిధముగా అష్టమహిషులూ ఉపచారము చెయ్యవచ్చారు; మేలుకొమ్మని కృష్ణుని పిలుస్తున్నారు.

> కేశవయని నిన్ను వాసిగ భక్తులు, వర్ణింపుచున్నారు లేరా
> వాసవ వందిత వసుదేవ నందన, వైకుంఠపురవాస లేరా
> కృష్ణా తెల్లవారవచ్చెను."

ఇంకోరకం – జీవుణ్ణి ఉద్దేశించి వేదాంతపరంగా చెప్పిన మేలుకొలుపు :

> "మేలుకొనవే రాజహంసా, మేలుకొను చైతన్యమా
> మేలుకొనవే శుద్ధనిలయా, మేలుకోగదవే, జీవా మేలుకో

శృంగారపరంగా శ్రీకృష్ణుని గూర్చి,

> "తెల్లవార వచ్చె తెలియక నా సామి,
> మళ్ళీ పరున్నావు లేరా
> వేణునాదము విని వేగ పరుగిడివస్తి,
> వేళాకోళా మేల లేరా"

♦ ♦ ♦

పారువేటపదాలు రాయలసీమలో నేడు ప్రచారములో ఉన్నవి. ఆ యూరి దేవాలయములో స్వామి ఏటికొకతూరి వేటకు వెళ్లుతాడు. వేటనుండి తిరిగివచ్చాక దేవి తలుపు తియ్యదు. వారిద్దరికీ వాదం జరుగుతుంది. ఈ వాదమే పాటలుగా పాడతారు. తలుపుల దగ్గిర పాటలు యివిగో.

> "శ్రీ తరుణిరో నే శ్రీరఘురాముడ,
> జేరి కవాటము దీయవే"

అని రాముడంటే సీత అంటోంది.

"ఖ్యాతిగ శ్రీరఘురాముడవైతే,
కోతుల జేరగదోయి
ఘనసేతువు గూర్పగదోయి"

అని హాస్యముచేస్తుంది.

మళ్ళీ
"క్షీరాబ్ధి తనయరో శ్రీలక్ష్మి వాకిలి,
"తీయవె సీతాదేవి తీయవె"

అని రాముడు తలుపు తియ్యమంటే-

"వాకిట నిలనుండి వాకిలి తట్టుచు, వాదించేవు
నీ పేరేమి రామా"

అని అడుగుతుంది.

మత్స్యావతారుడనునేనంటే, మడుగులోఉండక యిక్కడి కెందుకు వచ్చావంటుంది. ఈ విధముగా పది అవతారముల పేర్లూ చెప్పితే పదింటినీ ఆక్షేపిస్తుంది, చివరకు నాపేరు రాముడంటె తలుపు తీస్తుంది.

విసురురాతిపదాలు - పెద్ద తిరగళ్ళలో జొన్నలుపోసి ఇద్దరు స్త్రీలు విసురుతూ పాటలు పాడుతారు. తిరగలికిందరాతిమీద పయి రాయి తిరిగేటప్పుడు శబ్దము పుడుతుంది. దాన్ని శ్రుతిగాజేసుకొని ఈ పాటలు పాడతారు. కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకాలో ఈపాటలు నేను విన్నాను. పాటలలో స్వారస్య మంతగా లేకున్నా, విసురురాతిశబ్దములో శ్రుతి కలిగి ఇద్దరుస్త్రీలు మధురకంఠములతో పాడినప్పుడుమాత్రము త్రోవనుపోయే మనిషి నిలిచి వినకమానడు. మచ్చుకి ఒకపదం చూడండి.

"ఈయూరి కుమ్మరి యిల్లు నే నెరగ,
చెయ్యాలి కుమ్మరి గజ్జెల్ల కడవ
గజ్జెల్ల కడవాకి ఏబావి నీళ్ళు,
పేరైన 'యినుకాల' పెదబావి నీళ్ళు

బుడుగు బుడుగున ముంచి మోకాట పెట్టి,
అక్కడిక్కడ చూచి కట్టపై చూచి
కట్టమీద పొయ్యేది ఎవరమ్మ మీరు,
కట్టమీద పొయ్యేది గాజుల్లసెట్టి
నే నొచ్చి తడవాయె కడ వెత్తవయ్యా.
కడవ పేరు ఏంపేరు నీ పేరు ఏమి
కడవ పేరు గంగమ్మ నా పేరు సీత,
అయిపోయె గౌరమ్మ అయిపోయె నమ్మ
ఐపైన గిరిమీద ఆడి రావమ్మా,
మా జొన్న లయిపోయె మేము పోతాము
మళ్లొచ్చి నీ పాట ఎల్ల పాడేము."

కోలాటం పాటలూ, గొబ్బిపాటలూ ఆనాటి కానాడు ఆదరణ లేక నీరసిస్తున్నవి. శ్రీకృష్ణలీలలూ, రామకథా, కోలాటంపాటలుగా పాడతారు. రెణ్ణెల్లక్రితం మోడరన్ రెవ్యూలో "బెంగాలు ఫోక్ డాన్సు" అంటూ బొమ్మలతో కూడా వ్యాసము పడ్డది. ఇట్టి నాట్యాలు బెంగాలుకే కాదు; భారత దేశాని కంతకీ సమానమే. మనలో కోలాట మప్పుడు నృత్య ముంటుంది. పూర్వము పిన్నలూ, పెద్దలూ ఈ వినోద ముగో పాల్గొనేవా రనుకొంటాను. ఇప్పుడు పిన్నలుమాత్రమే పాల్గొంటున్నారు. పురుషులూ, స్త్రీలూ, పిన్నలూ, పెద్దలూ పూర్వ కాలమందువలె ఆటలూ, పాటలూ, పండుగులకీ, పబ్బాలకీ వీధుల్లో ఆడుతూ, పాడుతూ మళ్ళీ ఎప్పుడు వినోదిస్తారో! స్త్రీలుగానీ, పురుషులుగానీ కొంతవయస్సు రావడంతోనే ఆటలూ, పాటలూ కట్టి పెట్టుతున్నారు. చదువుకొన్న వారుమాత్రము కించిత్తు దొరల ఆట లాడుతున్నారు. మన ఆటలూ, పాటలూ అడుగంటుతున్నాయి.

"చిన్నీ బిన్నికి ఎన్నో ఏడు,
చెంగల గౌరికి ఎన్నో ఏడు
తాడీమేడికి ఎన్నో ఏడు,
తామరస మొగ్గల్లూ"

అంటూనున్నా,

"చినచిన దొంతుల్ చిటారి దొంతుల్,
లక్కా మేడల్ లవంగ మొగ్గల్
చిన్నీ మీ రేటివారే,
చిలకా మీ రేటివారే
తాయీ మీ రేటివారే,
తామర మొగ్గల్లూ తామర మొగ్గల్లు"

అంటూనున్నా; బాలికలు ఆడే ఆటలు ఒకమోస్తరు నాట్యమే కోలాటంవలెనే.

ఈ నాట్యకళనుకూడా సారస్వతముతో ఉద్ధరించవలసి ఉంటుంది.

గుజరాతు దేశములో గర్బనృత్యమని స్త్రీలు నృత్యముచేస్తారుట. ఒకమారు ఈ "గర్బడాన్సు" మీద పైపత్రికలోనే ఒక వ్యాసము బొమ్మలతో పడింది. గొబ్బిపాటలు పాడేటప్పుడు స్త్రీలు చేసే నృత్యము గర్బనృత్యమే. "గర్బ" అనేపదము "గొబ్బి" అయినదని అనుకొంటాను. సంక్రాంతి నెల అంతా గొబ్బి పిడకలు చేసుకొని, సాయంకాలం దీపాలుపెట్టి గొబ్బిపాటలు పాడుతూ స్త్రీలూ, బాలికలూ నృత్యముచేస్తారు.

"సుబ్బి గొబ్బెమ్మా, మొగలిపువ్వంటి
మొగుణ్ణి యియ్యావే, చామంతిపు వ్వంటి
చెల్లెలి నియ్యావే, తామరపు వ్వంటి
తమ్ముణ్ణియ్యావే, పనసపం డంటి
బాలుణ్ణియ్యావే,... ఇత్యాది.

ఈ గొబ్బిపాటలు అనేకవిధాలుగా ఉన్నవి.

◆ ◆ ◆

స్త్రీల సారస్వతములో మంగళారతుల కున్న ప్రాముఖ్యమూ, ప్రచారమూ ఇక దేనికీ లేదు. సమస్త శుభకార్యములకూ

ఇవి అవసరముకాబట్టి, సమస్త దేవతలకూ అనేక వరసలలో మంగళహారతులు రచించియున్నారు కవులు. ఇతర భాషలలోని మంగళారతులుకూడా తెనుగులో ప్రచారములో ఉన్నవి. ముఖ్యముగా సంస్కృతభాషను రచించినవి.

> "రామచంద్రాయ జనకరాజజా మనోహరాయ
> మామకాభీష్టదాయ మహిత మంగళమ్" ఇత్యాది.

ఒక మంగళహారతితో ఈ వ్యాసము ముగిస్తున్నాను. పార్వతి సర్వజ్ఞుణ్ణి చూడబోతోంది. ఎక్కడికి వెడుతున్నావని చెలికత్తెలడుగుతారు. పార్వతి సమాధానం చెప్పుతుంది.

ఘల్లుఘల్లున పాద గజ్జె లందెలు మ్రోయ,
కలహంస నడకల కలికి యెక్కడికే
జడలోను గంగను ధరియించుకున్నట్టి,
జగము లేలే సాంబశివుని సన్నిధికే,
మంగళం మంగళం ;

తళతళమను రత్నతాటంకములు మెరయ,
పసిడి కుండలముల పడతి యెక్కడికే,
కరియోగచర్మము కటిధారుడై నట్టి
గురుడైన శంభుశంకరుని సన్నిధికే,
మంగళం మంగళం ;

చెంగావిచీరల కొంగులు జారంగ,
రంగైన నవమోహనాంగి యెక్కడికే
పులితోలు వస్త్రాలు భూతి ధరియించిన,
బ్రహ్మాండ మేలు జగదీశు సన్నిధికే
మంగళం మంగళం.



# ఆడవాళ్ల పాటలు

పూర్వ గ్రంథాల్లో పేర్కొనబడ్డ కొన్ని పాటల పేళ్లను వ్రాసి, వాటికి యక్షగానాదులనుండి ఉదాహరణములు ఇస్తున్నాను. లక్షణగ్రంథాల్లో కొన్ని పాటల పేళ్లు చెప్పబడ్డవి. కావ్యాదులలో కూడ పాటలు పేర్కొనబడ్డవి. ఈపాటలు ఆయాకాలములనాటి సంఘ మర్యాదలను పట్టి యిస్తున్నవి. ఒక వ్యక్తి జీవితచరిత్రలో ముఖ్యఘట్ట ములకు సంబంధించి ఉంటవి ఈ పాటలు. పుట్టినప్పుడు పాటలు, నిద్ర పోగొట్టునప్పుడు పాటలు, మేలుకొలుపులకు పాటలు, బువ్వము లారగించేటప్పుడు పాటలు, ఏగతాళి పాటలు, పెండ్లి కార్యమునకు సంబంధించిన అనేక పాటలు, ఆరతులు, నివ్వాళులు, ఆటలకు సంబంధించిన పాటలు ఇత్యాదులు.

ఈ పాటలకు ఈ కాలములో గౌరవము లేదు. పాశ్చాత్య విద్యాసంపర్కమువల్ల మన జాతీయతా, సంస్కృతీ పెద్ద దెబ్బ తిన్నవి. ఈ పాటలు మళ్లీ పునరుజ్జీవితము లవుతవో, లేదా వేరు రూప ముతో అవతరిస్తవో, లేదా మాసిపోతవో చెప్ప వీలులేదు. మ్యూజి యములో ఉంచుకొనే ప్రాచీన వస్తుసముదాయమున కున్న విలువే నేడు ఈ పాటల కున్నది. మ్యూజియమునకు వస్తువులను పోగుచేసి జాగ్రత్తచేసినట్టుగానే, ఈ పాటలను మనము జాగ్రత్తచేయవలసి ఉంటుంది.

అప్పకవీయములో లాలిపాటకూ, పెండ్లి పాటకూ, ధవళము, సువాల మున్నగు పాటలకూ లక్ష్యము లున్నవి.

ఆనందరంగరాట్ఛందములో సూళాదితాళకొట్నములు, ధవళములు, శోభనములు, ఆరతిపాటలు, జోలలు, ఏలలు, గొబ్బిళ్ళు మున్నగుపాటలు పేర్కొనబడ్డవి.

గుడారు వెంకటదాసకవి బలరామచరిత్రలో ధవళము, సువ్వాల, శోభనము, ఆరాత్రిక, లాలి మున్నగు పాటలు పేర్కొనబడ్డవి.

గణపవరపు ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసములో ధవళము, శోభనము, ఆరాత్రిక, సువ్వాల, లాలి మున్నగు పాటలు పేర్కొనబడ్డవి.

లక్షణదీపికలో ధవళములు మున్నగు పాటలు పేర్కొనబడ్డవి.

భాగవతములో— యశోదకు చిన్ని మగవాడు పుట్టెనని గోపికలు చూడవత్తురు. వారు చిన్నికృష్ణుని చూచి, సంతసించి, తెచ్చిన కానుక లిచ్చి—

"పాపనికి నూనె దలయంటి, పసుపు బూసి
బోరు కాడించి హరిరక్ష పొమ్మటంచు
జలము లోక కొంగ్ని చుట్టి రా జల్లి తొట్ల
నునిచి దీవించి పాడి ర య్యువిద లెల్ల.
జోజో కమలదళేక్షణ
జోజో మృగరాజమధ్య జోజో కృష్ణా
జోజో పల్లవకరపద
జోజో పూర్ణేందువదన జోజో యనుచున్."

ఇచ్చట పోతన్నగారు జోలపాట కంద పద్యములో బిగించారు. సాధారణముగా జోలపాటలు ద్విపదలలో ఉంటవి.

పూతన శ్రీకృష్ణునికి చన్నుగుడిపి మరణించినది. అప్పుడు గోపికలు శ్రీకృష్ణునకు రక్షచేసి దీవించిరి. అప్పుడు—

"ఆ పెద్ద వేడబంబుల
పాపనికిని జన్ను గుడిపి పానుపుపై సం
స్థాపించి కప్పి 'కూరుకు
మో పాపడ' యని యశోద యొయ్యన పాడెన్."

యశోద పాడిన పాట జోలపాట.

మరిన్ని, గోపకులు వ్రేపల్లెలో ఉండుటకు భయపడి బృందావనము తరలి వెళ్ళిరి. అప్పుడు—

"పసుపు లాడి, యురోజకుంకుమపంకశోభితలై లస
ద్వసనలై, కచభారచంపకదామలై, సులలామలై,

పసిడిమాడల కాంతు లబ్జుల బర్వ దేరుల మీాద బెం
పెసగ బాడిరి, త్రేత లా హరిహేల లింపగు నేలలన్."

గోపస్త్రీలు ఈ సంతోషసమయమున ఏలలు పాడిరట.

కళాపూర్ణోదయములో జోలపాటలు, పెండ్లి పాటలు పేర్కొనబడ్డవి.

"పొలుపఱ దన్ను వే నిదుర
బుచ్చుటకై తమ తల్లి పైడి యు
య్యెల నిడి యూపుచో, గువల
యాధిపు పాటలు పాడినం గరం
బలరుచు గేరి కేరి నగు;
నన్యుల పాటలు పాడినం, గరం
బలయుచు నేడ్చు, లోకు లవు
రా పతిభక్తి యటంచు నవ్వగన్.

మంగళసూత్రము గట్టె గు
రంగాక్షికి నంతరంగరాజేంద్రుడు పు
ణ్యాంగనలు పెండ్లిపాటలు
మంగలికోళ్లమృదుగీతి మధురిమ నెనయన్."

గౌరన వ్రాసిన హరిశ్చంద్రద్విపదలో మాతంగ కన్యలు వీణ వాయించి రాగములు—

"యాలాపములు చేసి, యారాజు మీాది
సూళాదు లింపులు సొగయ బాడుటయు"

అని ఉన్నది. గౌరన హరిశ్చంద్ర ఛాయనే వ్రాసిన శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానములో ఈ విషయమే యిట్లు వర్ణింపబడినది:

"గాణ ల్మెచ్చగ బాడి రింపు దొలకంగా దాళమానంబులన్
క్షోణీనాథజయాంకసంకలితముల్ సూళాదిగీతావళుల్
వాణీపాణిసరోరుహాంగుళి నఖ వ్యాపారలీలారణ
ద్వీణాసంచితపంచమక్వణ కళా విఖ్యాత కంఠధ్వనిన్."

చేమకూర వేంకటకవి తన విజయవిలాసములో సుభద్ర పెండ్లి సందర్భమున ధవళములనూ, అయిరేని పాటలనూ పేర్కొన్నాడు. అయిరేని పాటలనే వ్యవహారములో అవిరేడు పాటలంటారు. వీటికి ఉదాహరణము ఇప్పుడీయలేదు.

"కట్టిరి మంచిలగ్నమున కంకణముల్ కర పంకజంబులన్
బెట్టిరి మేనులన్ నలుగు మేలిమృగీమదకుంకుమంబులన్
జుట్టిరి కైశికంబుల విశుద్ధమనోహరపుష్పమాలికల్
పట్టిరి పేరటాండ్రు ధవళంబులు పాడుచు నుల్లభంబులన్.

కులదేవతను దెచ్చి నిలిపిరి మాణిక్య
చకచకల్ గల పెండ్లి చవికదండ,
ఐరేని గొనివచ్చి రైదువల్ పాటలు
పాడుచు శుభవేళ వేదు కలర
బులుగడిగిన ముత్తెముల బాసికంబులు
సరవిగట్టిరి నేర్పు సంఘటిల్ల."

... ... ... ...

పైని పేర్కొనబడ్డ పాటలకు ఉదాహరణము లిక్రింద ఇస్తున్నాను. సూళాదిగీతముల స్వరూపమెట్టిదో తెలియలేదు. వాటికి ఉదాహరణము చిక్కలేదు.

## ఏలలు

రుద్రకవి సుగ్రీవవిజయ మనే యక్షగానము (నాటకము) వ్రాశాడు. అందు సుగ్రీవునకు మొదట పట్టముగట్టారు. తరువాత అంగదునకు యువరాజ్య పట్టాభిషేకము చేసిరి. అప్పుడు సకల వానరసమేతంబుగా సుగ్రీవుడు రామచంద్రునకు కానుకలు గొంచుక వచ్చెను. అప్పుడు అగ్గిరిప్రాంతంబున నున్న చెంచితలు ఏలలు బాడిరట యెటువలె-

"భానువంశమున బుట్టి
దానవకామిని గొట్టి

మునివరులు సన్నుతించగా - ఓ రామచంద్రా
పూని ముఖము నిర్వహింపవా.

రాతి నాతిజేసి పురా
రాతిచేతివిల్లు విరిచి
భూతలేంద్రు లెల్ల మెచ్చగా - ఓ రామచంద్రా
సీతను వివాహమాడవా.

పరశురాము భంగపరచి
భరతునకూ రాజ్య మిచ్చి
గుహుడు బనుప నడవి కేగవా - ఓ రామచంద్రా
సురలు భూసురులు మెచ్చగా."

♦ ♦ ♦

రుక్మిణీపరిణయము, సహస్రకంఠరామాయణము మొదలైన బహువిధ ప్రబంధములు నిర్మించిన త్వరకవి రామకృష్ణప్రభాని రచించిన భవానీశంకరవిలాస మనే యక్షగానములో పార్వతీ పరమేశ్వర సంవాదరూపమున ఏలలు రచింపబడినవి.

తులాభారము, లేపాక్షికృష్ణనాటకము, చిక్కయ్యచరిత్రము మున్నగు యక్షగానాలలోకూడా ఏలలు రచింపబడినవి. కాని, పైని ఉదాహరించిన ఏలపాటకును, వాటికిని కొద్ది భేదము కనిపిస్తూ ఉన్నది. నిమ్మనాథుడు వ్రాసిన చిక్కయ్యచరిత్రలోని ఏలపాట ఈ విధముగా ఉన్నది :

"శరణు శరణు దేవరాయ శరణు శరణు జనవిధేయ
శరణు దేవతారాధ్య శరణు వేదాంతవేద్య
ఎన్ని జన్మములను నిన్ను ఏను పూజచేసినానో
కన్నులార నిన్ను జూడ కలిగె నే పవిత్రమైతీ."

♦ ♦ ♦

అధునాతనగ్రంథమగు ప్రహ్లాదవిజయ మనే యక్షగానములో ఏలలు, రుద్రకవి ఏలలవలెనే ఉన్నవి.

''ఉక్కుకంబమున వెడలి, రక్కసునీ ఉక్కడంచి
మక్కువతో బాలు గావవా—ఓ నరసింహా
దిక్కు నీవే మమ్ము బ్రోవుమా''

## ధ వ ళ ము లు

రుద్రకవి వ్రాసిన సుగ్రీవవిజయమున సుగ్రీవ పట్టాభిషేకానంతరము పుణ్యాంగనలు ధవళంబులు పాడిరట, యెటువలెను—

"శ్రీరాముడు గుణధాముడు వారిజలోచనుడూ
శూరత రావణు గూల్చి నారీమణి దేవలయుక్
రాముని కృప కపిరాజ్యము క్షేమంబున బాలించే
శ్రీమంతుడు సుగ్రీవుడు భూమండలి బొగడొందు
సంగరవిజయముతో నుప్పొంగెడు సుగ్రీవునకు
సంగతిగా యువరాజ్యత నంగదు డిల పెంపొందు."

మన్నారు దాసవిలాస నాటకములో—విజయరాఘవనృపతికిన్నీ, కాంతిమతికిన్నీ వివాహము జరుగు సందర్భమున బ్రాహ్మణ స్త్రీలు ధవళములు పాడిరట—

"తిమ్మక్క – ఔ, పొరుగింటి తిమ్మావధాని పెండ్లాం! వీరమ్మ పాటలు పాడుచున్నది. అంటుకోని నీవున్నా పాడ్రాదమ్మో?

యల్లమ్మ – యిదేందో నీవు నాగపసానివై పెద్దతనం చేసుక వుండే దానవున్నా, కడమవారు పాటలు పాడేవారున్నా?

తిమ్మక్క – వోశమ్మా, నాకు పాటలు పాడేటందుకున్నప్రొద్దు వున్నదమ్మా? మా పుట్నింటిలో వుండేప్పుడు కొండవీటి సర్వామచేత పదినుడుగులు నేర్చుకొంటి. పాడుదునోఅంటే శిగ్గవుచున్నది. ఇక్కడంతా మొగవారే వున్నారు. నీవు ధవళ మెత్తు. నేనుంగూడా పాడేగాని.

"జయజయ తంజపుర వాసా, జయజయ మంజుళహాస,
జయజయ మదనవిలాస జయజయ మన్నారుదాసా

జయజయ సుజనవిధేయ జయజయ సమరగాంగేయ
జయజయ దానరాధేయ జయజయ దక్షిణరాయ."

♦ ♦ ♦ ♦

అప్పకవి తన లక్షణగ్రంథంలో ఉదాహరణగా ఇచ్చిన ధవళము—

"అక్షరహరివికచాంబురు – హాక్షా యక్షపసఖ
రక్షక సురవిదురద్విప – రక్షా రాక్షసవిదళన
పక్షగపతిరథపౌండ్రవి – పక్షా భక్షితదవశిఖి
వృక్షగసహచరఋక్షస – దృక్షాఋక్షపదుహిత్రుప."

భవానీశంకరవిలాస మనే యక్షగానములో –

– అని యిట్లు ప్రసన్నులగు ఉమామహేశ్వరుల నొక్క రమ్యంబగు నవరత్నఖచితహేమడోలికనుంచి చెలికత్తియలు కైవారంబులు చేయుచు ధవళంబులు బాడి రెట్లనిన –

"జయజయ జగదాధారా జయజయ జలధిగభీరా
జయజయ శైలవిహారా జయజయ మందరధీరా
జయజయ పన్నగహారా జయజయ వైరివిదారా"

♦ ♦ ♦

చిక్కయ్యచరిత్ర, ప్రహ్లాదవిజయము మున్నగు యక్షగానములలోకూడా ఇట్టి ధవళములు కలవు.

## శో భ న ము లు

గోకులపాటి కూర్మనాథకవి రచించిన మృత్యుంజయవిలాసములో పార్వతీపరమేశ్వరుల కల్యాణమహోత్సవము వర్ణింపబడింది.

"సలలితక్రమమొప్ప సనికంటెమీద,
తరుణిని సప్తపాదములు ద్రొక్కించె;
మరుని జేగంట నా మంగళసూత్ర
మంగనామణి కంఠమందుంచి యొసగ;

మంగళస్థితి సర్వమంగళగళము,
నందు బొందుగ గట్టె నర్ధేందుహాళి..."

అప్పుడు పేరటాండ్రు పాటలు పాడిరట యెటువలెను –

"శోభనమే శర్వునకు, శోభనమే పార్వతికి
శోభనమే కైలాసశుభమందిరునకు శోభానమే.
మణితతుల హారతులు, మదవతులు ఇయరమ్మా
మతియుతుడు శివ్వన్న మగువ గౌరమ్మాకు శోభానమే."

మన్నారుదాసవిలాసనాటకములో ధవళములు పాడినపిమ్మట, బ్రాహ్మణస్త్రీలు శోభనంబులు పాడిరట యెటువలెను –

"చోళాధినాథునకు శుభకీర్తిసనాథునకు
బాలార్కతేజునకు భామామనోజునకు – శోభనమే
కనకాచలధీరునకు కవిజనమందారునకు
మనసిజవిలాసునకు మన్నారుదాసునకు – శోభనమే."

అమ్మనూరి వేంకటసుబ్బసత్కవి రచించిన రసవంతమగు వేములపల్లి ఉషాపరిణయము అను నాటకమున – శ్రీకృష్ణుడు ఉషాపరిణయమైన పిమ్మట దంపతులను వెంటబెట్టుకొని ద్వారకాపురంబు డాయం జని, సచివపురోహితసుహృద్బాంధవ ముఖ్యులెదురుకొన భూసురాశీర్వాదంబులును, పుణ్యాంగనా కరకలితలలితాక్షతంబులు గైకొనుచు నిజగృహద్వారంబున రథంబు డిగ్గినం గనుంగొని కొంద రిందుముఖులు బంగారుపళ్ళెరంబుల కర్పూరనీరాజనంబులు దెచ్చి నివాళింపుచు హరి నుద్దేశించి శోభనంపు పాటలు పాడిరట యెటువలెనంటేని –

"దేవతలును ప్రార్థింపగను
భూవలయంబును బ్రోచుటకై
దేవకి కడుపున ధీరతబుట్టిన
దేవునకును వాసుదేవునకూ – శోభనమే.
కొట్టక తల్లి గుట్టుగను,
పట్టక రోటికి కట్టినను

మట్టుమీఱి యీ మద్దుల గూర్చిన
రట్టడి శ్రీకృష్ణరాయునకు - శోభనమే."

ప్రహ్లాదవిజయమందున్నూ శోభనపు పాటగలదు.

## కొట్నములు : సువ్వాల

అప్పకవీయములో సువ్వాల కిచ్చిన ఉదాహరణము -

"అక్షరహరివికచాంబురుహాక్షా
యక్షపసఖనుతయదుకులదక్షా
రక్షకసురవిదురద్విపరక్షా
రాక్షసవిదళన ప్రరుచిరవక్షా - సువ్వీ
పక్షగపతిరథ పౌండ్రవిపక్షా
భక్షితదనశిఖిబహు సవదీక్షా
వృక్షగసహచరఋక్షసదృక్షా
ఋక్షపదుహితృపఋషి జనపక్షా - సువ్వాలె."

మృత్యుంజయవిలాసమున -

శేషహోమంబు సలిపినాక బలికై సమకట్టిరంత. అప్పుడు కప్పురగంధులు పెండ్లికొట్నంబుల పాటలు పాడిరట యెటువలెను -

"ఇంతిరావె గొజ్జంగి బంతి రావె రత్నాల
దొంతి రావె మదనుని దంతి రావె
కొమ్మ రావె బంగారుబొమ్మ రావె చివురు లే
గొమ్మ రావె ముద్దులగుమ్మ రావె,
చెలియ రావె చేడె రావె చిన్నిరావె పొన్నరావె
వెలది రావె కొట్నములు వేగ దంచుదము.

గుఱుడవాహనములు మంచి గౌరికుసుమములు రత్న
సరులు పచ్చ గన్నేరు సన్నదినుసులు
కలయఁగూర్చి కరములందు కంకణక్వాణము మెరయ
నలరుటందె లెల్ల ఘల్లు రనగ దంచిరి

సువ్విసువ్వి సువ్విసువ్వి సువ్విసువ్వి సువ్విసువ్వి
సువ్వి సువ్వన్న సువ్వి సువ్వాల."

మన్నారుదాసవిలాసనాటకములో-

అచ్యుతవిజయరాఘవాధిపు పెండ్లికి ముచ్చటలాడుచు ముత్తైదువులు వచ్చిరి. ఈ సరణి వచ్చిన సువాసినులు సేసలువెట్టి కొట్నంబులు కొట్టిరట యెటువలెను-

"సువ్వి మన్నారుదాస సువ్వి రమ్యహర్మ్యవాస
సువ్వి రుచిరముఖవిలాస సువ్విసువ్వి
సువ్వి చోళభూమిపాల సువ్వి సుజన వినుతశీల
సువ్వి యువతిపాంచాల సువ్వి సువ్వి."

♦ ♦ ♦ ♦

ద్రౌపదీ కల్యాణ నాటకమునందు-

"ఖ్యాతిమీర పాండవులకు నాతియైన ద్రౌపదికిని
ప్రీతితోడ నలుగు లిట్లు పెట్టి పిదపను
కుందనంపు పుటికెలందు కోరి రాజనములు నించి
సుందరాంగులు పాటలు పాడుచు సుంకులు దంచిరీ
సువ్వి కావేటిరంగ సువ్వి కస్తూరిరంగ
సువ్వి రామాభిరామ సువ్వాల."

ప్రహ్లాదవిజయంనుంచి ఒక ఉదాహరణము-

(కర్త : నిశ్చింత ఎంబారయ్య.)

"సువ్వి లక్ష్మీనృసింహా సువ్వి శమితపాపరంహా
సువ్వి యనుచు బాడ రమ్మ సుదతులందరు
కరి మొరాలించి వేగ కరుణతోడ వచ్చి మకరి
శిరము ద్రుంచి కరిని గాచు హరిని బాడరే."

## లాలిపాటలు : జోలలు

అప్పకవీయములో లాలిపాట కిచ్చిన ఉదాహరణము సువ్వాల కిచ్చినదే. పాటచివర 'సువాలా' అనుటకు బదులు 'లాలీ' అనవలెననే నియమముమాత్రమే కానవస్తున్నది.

మన్నారుచాసవిలాస నాటకములో-

వివాహశేషహోమంబులు శేఖరించువేళ, కులక్రమాగత శుభాచారానుకూలంబుగా బాలునకు బాలలు జోలలు పాడిరట యెటువలెను -

"జోజోజో బాణాసురారి, జోజోజో చాణూరవైరి
జోజోజో వేణుగానానుకారి జోజోజో పద్మావిహారి
జోజోజో గోపికాజార జోజోజో నవనీతచోరా
జోజోజో జగదాధార జోజోజో నందకుమార."

ఇంకోమాదిరి జోలపాట రామదాసుచరిత్రలోనిది -

"జో రవికులశుభాంగ జో సన్నుతాంగ
రార కరుణాపాంగ రమ్యాంతరంగా-జోజో.
శ్రీవెలయు పాలవారిధి పవ్వళింపా
దేవబృందము లెల్ల దివి సన్నుతింపా
భావ మెంచినవారి భక్తి పాలింపా
దైవరాయా మాకు తరమె వర్ణింపా-జోజో."

♦ ♦ ♦

మృత్యుంజయ విలాసములో -

"ఆరూఢి పా న్పెక్కి యా సతి పురుషు
లుయ్యాలలో బొమ్మనుంచి వసంత
మొయ్యన జిలికించి యువిద లవ్వేళ
జోజో కుమార జోజో చిన్నియన్న
జోజో ననుం గన్న చొక్కపు తండ్రి''

యనుచు పాటలు పాడిరట దంపతులకు.

ప్రహ్లాదవిజయములో లాలిపాట ఇట్లున్నది :

"లాలి కరుణాపాంగ లాలి భవభంగ
లాలి శయనభుజంగ లాలి సత్సంగ - లాలీ
నీలనీరదగాత్ర నిరుపమచరిత్ర
పాలలోచనమిత్ర పావపవిత్ర - లాలీ.''

ఇట్టి లాలిపాటలూ, జోలపాటలూ అనేకతరహాలుగా తెలుగు దేశములో ప్రచారమం దున్నవి.

పైన ఉదాహరించిన పాటలకేగాక మంగళహారతులకు, అప్పగింతల పాటలకు, తలుపుతీసే పాటలకు, నలుగు పాటలకు, బువ్వంబంతి పాటలకు, గొబ్బిళ్ల పాటలకు మున్నగు పాటలకు యక్షగానాదులలో ఉదాహరణములు దొరుకుచున్నవి. అందు మంగళహారతులు అనేకవిధములైన వరుసలలో ఉన్నవి. గ్రంథ విస్తరము కాగలదని ఉదాహరణము లిచ్చుట లేదు. ఇవిగాక జంపెలు, కుసుజంపెలు, అర్థచంద్రికలు మున్నగువాటినిగురించి ప్రత్యేకవ్యాసము వ్రాయవలసి ఉన్నది.

## హెచ్చరిక

ఇక హెచ్చరికఅనే పాటకు రామదాసు చరిత్రనుండి ఉదాహరణము :

''హెచ్చరిక శ్రీరామ హెచ్చరిక రామా
హెచ్చరిక రఘురామ హెచ్చరిక రామా
బంగారుగిన్నియల పొంగుదీగిన పాలు
అంగనలు దెచ్చినా రన్న హెచ్చరికా
పచ్చకపురపు విడెము హెచ్చుగా సీతా
ఇచ్చుచున్నది రామదేవ హెచ్చరికా.''



ఈ పాట వేరొకవిధముగా ప్రహ్లాదవిజయమున కనబడుచున్నది :

"శ్రీరామారమణా యాశ్రితదోషహరణా
కారుణ్యాభరణా నతశరణా హెచ్చరికా,
శరణాగతజనరక్ష సరసీరుహాక్ష
మురదానవశిక్ష కరివరదా హెచ్చరికా."

## పెండ్లిపాటలు

అప్పకవి పెండ్లిపాటకు ఈ క్రింది ఉదాహరణ మిచ్చెను:

"లక్ష్మీకల్యాణవైభవమే-
అక్షరహారివికచాంబురుహాక్షా
యక్షపసఖనుత యదుకులదక్షా
రక్షకసురవిదురద్విపరక్షా
రాక్షసవిదళన ప్రరుచిరవక్షా-
లక్ష్మీకల్యాణవైభవమే."

మృత్యుంజయవిలాస మందలి పెండ్లిపాట ముచ్చటగా ఉన్నది. అది ఇందు ఉదాహరిస్తున్నాను:

"శ్రీమహాలక్ష్మిని శ్రీవిష్ణు బోలి
తామరతంపరై దగి దంపతులు
పూవున తావియు బొందినయట్లు
ఈ వధూవరు లుందు రెనసి యెల్లపుడు
కలికి మా గౌరమ్మ కడగంటి చూపు
కలువ పూవుల దండ గద శంకరునకు
చెన్నుగ పూవుల చేరెత్తినట్లు
కన్నె మా గౌరమ్మ కాపురం బొప్పు
కడు వేడుకలచేత కడుపు చల్లగను,
కొడుకుల కోటనై కొమరొందవమ్మ
వెలయంగ దగు చోట్ల వియ్యంబు లంది
కలకాల మఖిలభోగముల వర్థిల్లు."

భక్తికీ, యోగమునకూ సంబంధించిన పాటలేగాక, శృంగారపరమైన పాటలున్నూ అనేక మున్నవి. వేదాంతమునకు సంబంధించిన పాట ఒకటి ఉదాహరించి ఇంతటితో ఈ వ్యాసము ముగిస్తున్నాను. పాటల స్వరూపము తెలపడమే ఈ వ్యాసముయొక్క ఉద్దేశముకాబట్టి ఇతరవిషయము లేమీ ఎత్తుకొని చర్చించలేదు.

## వేదాంతకీర్తన

"భక్తురాల యిటు రమ్మని నను చే
పట్టి పిలుచుకొనెనే
రక్తిలేని సంసారము విడిచి వి
రక్తి బొందు మనునే - భక్తురాల.
జలజనయన శాంభవి ముద్రకు
జననస్థల మనునే
కలికిరో యున్మనియను ముద్రకు సం
కలితభూమి యనునే - భక్తురాల.
ఎల్ల లోకముల నిండి చెలంగెడు
ఎరుకే నీ వనునే
సలలితహృత్కమలాంతరంగమున
సౌఖ్యమొందు మనునే—భక్తురాల.



# బాలవాఙ్మయం

విద్యావిధానాన్ని బాగు చెయ్యాలెననీ, అందరినీ అక్షరాస్యులను చెయ్యాలెననీ దేశమందంతట ఉత్సాహము చెలరేగుతోంది. దొరతనములు అందుకై నడుములు బిగించినవి. ఈ సందర్భములో బాలుర కుచితమైన వాఙ్మయము మనకు కద్దా అని విచారిస్తే లేదని చెప్పాలి. ఇట్టి లోపములు తీరిస్తేనే తప్ప విద్యాబోధ సరియైన పునాదుల మీదపడే అవకాశం లేదు. ఈ లోపము తీరడానికి (1) ప్రాచీన వాఙ్మయాన్ని ఉద్ధరించవలసియున్నది. (2) సవ్యకవులు నూతనసృష్టి చేయవలసియున్నది. మన ముద్ధరించవలసిన ప్రాచీన బాలవాఙ్మయ స్వరూప మెట్టిదో కొద్దిగా చూదాము. శిశువు జన్మించినది మొదలు బాల్యదశ వీడేవరకూకూడా వాని మనస్సుకు రంజకంగా ఉండే వాఙ్మయము వానికి అందుబాటులో ఉండాలి. తెలుగు తల్లులు తమ బిడ్డలకు ఉగ్గుపాలతో పాటు కావ్యరసమున్నూ పోశారనడానికి జోలపాటలూ, లాలిపాటలూ నిదర్శనము.

## జోలపాటలు

రామ లాలీ మేఘశ్యామ లాలీ
తామరస నయనా దశరథ తనయ లాలీ
అద్దాల తొట్టెలో నీవు అమరిఉండగా
ముద్దుపాపడంచు నిన్ను మురిసి చూచారు ॥రామ లాలీ॥

ఇందు ఒకే దేవుణ్ణి ఉద్దేశించి పాడడముండవచ్చు. లేదా పసిపాపల చిన్నబుద్ధులకుకూడా అర్థమయ్యే విషయములతో కూడి ఉండవచ్చు.

ఉదాహరణము

(1) హాయి వా రమ్మాయి నీళ్ళు కెళ్ళింది
పాలైన యివ్వవే ఓ కుక్కపిల్లా

(2) అల్లవారింటికి చల్లకెడితేను
అల్ల వారి కుక్క బొంయి మన్నాది
నా కాళ్ళ గజ్జల్లు ఘల్లు మన్నాయి
నా చంకలో బిడ్డ కేరు మన్నాడు.

(3) పిల్లెమ్మ వెళ్ళింది పల్లెల్లు దాటి
అబ్బాయి వెళ్ళేడు రచ్చల్లు దాటి

కుక్కపిల్లలూ, పిల్లిపిల్లలూ ధ్వన్యనుకరణములూ బాలురను ఆకర్షించేవేకదా. పిల్లలను ఆడించేటప్పుడు పాడే చందమామ పాటలు, గుమ్మడి పాటలూ, దాదం దక్కచ్చి మొదలయినవికూడా వారిని ఆకర్షించేవే.

కొందరు పిల్లలు చేరి ఆడుకొనేటప్పుడు పాడే పాటలు వారి చిత్తవృత్తుల కనుగుణమైవుంటవి.

(1) కాళ్ళగజ్జి కంకాళమ్మ మొదలైనవి.

(2) గుడుగుడు గుంచం గుండారావం పాములపట్టం మొదలైనవి.

(3) ఒకాకా వోచెలియా, రెండూ లోగిళ్లా మొదలైనవి.

ఇవి ముఖ్యముగా అర్థములేని అనుప్రాస ప్రధానమయిన పాటలుగా ఉంటవి.

## కిండరు గార్డెన్ పద్ధతి పాటలు

కిండరు గార్టెన్ మార్చెస్‌కు అనుగుణమయిన పాటలుకూడా ఉన్నవి.

(1) చినచిన దొంతుల్ చిటారి దొంతుల్
లకాకా మేడల్ లవంగ మొగ్గల్
చిన్నీ మీ రేటివారే, చిలకా మీ రేటివారే మొ॥

(2) బుజబుజ రేకుల పిల్లుందా
బుజ్జా రేకుల పిల్లుందా

తాడిమేడి పిల్లుందా
తామరగిరీ మొగ్గల్లు.

## కట్టుకథలు

ఇక కథావాఙ్మయము ఎట్టిదంటే ప్రథమమున తల్లులుగాని, ముసలమ్మలుగాని చెప్పే చిన్ని కట్టుకథలు. మొట్టమొదట మన యిళ్ళలో శిశువులు వినే చిన్నకథ చీమకథ. అట్టివే నల్లి, పేను వగయిరా జంతుకథలు. ఇవి గాక, యంత్రాలకు సంబంధించిన మజిలీకథలూ, పంచతంత్ర కథలూ, యథార్థ కథలూ క్రమక్రమంగా పిల్లలు నేర్చుకొంటున్నారు. ఈ పాటలలోనూ, ఈ కథలలోనూ అద్భుతరసము ప్రధానముగా ఉంటుంది. బాలుర నాకర్షించే రసము కూడా అద్భుతరసమే కాకుండా, బాలుర చిన్నబుద్ధులు గ్రహించ గలిగే హాస్యరసముకూడా వాటిలో కద్దు. మచ్చు చూపుతాను.

(1) వదినా వదినా వల్లంకి పిట్టా
గదిలో పెట్టా గంజి నీ ళ్లోయ్యా
నీ కొడుకు కొట్టా నా పేరెట్టా
అన్నయ్య కొట్టా, ను వ్వేడ్వా, నే నవ్వా.

(2) బావా బావా పన్నీరు
బావను పట్టుకు తన్నేరు
మూలా మంచం వేశారు
మూడూ గుద్దులు గుద్దేరు
నులకామంచం వేశారు
నూరూ గుద్దులు గుద్దేరు.

(3) బుర్రుపిట్ట బుర్రుపిట్ట తుర్రు మన్నది
అత్త తెచ్చిన కొత్త కోక కట్ట నన్నది
మామ తెచ్చిన మల్లెపువ్వులు ముడువ నన్నది
పడమటింటీ కాపురమ్మా చేయ నన్నది
మొగుడు కొడితే మొత్తుకుంది
బిడ్డ పుడితే ఎత్తుకుంది.

## కొన్ని పసిడి తునకలు

ఇంతే కాకుండా ఈ బాలవాఙ్మయంలో ఏ దేశపు సారస్వతానికైనా వన్నెదెచ్చే దివ్యకవిత్వపు పసిడితునకలు దొరుకుతవి. మచ్చుకు-

(1) ఆట మాణిక్యమే పాట మాణిక్యం
నట్టింట అమ్మాయి రత్నమాణిక్యం

(2) ఆడుకొని అబ్బాయి వచ్చె కాబోలు
అందెళ్ళ చప్పుళ్లు పందెళ్ళలోన
చదువుకొని అబ్బాయి వచ్చె కాబోలు
సరస్వతీచప్పుళ్లు సావిళ్ళలోన.

(3) అందరీ మామల్లు మేనమామల్లు
అమ్మాయి మామల్లు చందమామల్లు.

(4) ఏడవకు ఏడవకు వెర్రి నాగన్నా
ఏడిస్తె నీ కళ్లు నీలాలు గారు
నీలాలు కారితే నే చూడలేనూ
పాలయిన గారవే బంగారు కళ్లు.

మాతృప్రేమ నంతనూ కొద్దిమాటల్లో యిమడ్చడమే యీ పాటలలోని ప్రతిభకు లక్షణం. ఇంకా ఈపాటల్లో పరిశోధకులకు పనికివచ్చేటట్టులు అనేకం వున్నవి. ఈ పాటలూ, కథలూ కొన్ని నన్నయ్యకుకూడా పూర్వమందు పుట్టి, నేటివరకూ నిలిచి ఉన్నవి.

(1) కథలలో ఈగకథ మిక్కిలి ప్రాచీనమైనది. ఈగకు "ఈ" అనేపేరు ఎప్పుడు వాడుకలో ఉండేదో, అప్పటినుంచీ ఈకథ తెలుగు దేశంలో వ్యాప్తిజెందిఉన్నది. ఈ క్రింది గేయభాగములు పరిశోధనార్హములేమో నిర్ణయించాలి.

(2) అగడం, పగడం, కవిలికి దంతం, గిరగిర చక్రం, గింజప్ప, ఆహా, ఊహా, కళింగ పాపడు కడ్డీ కడ్డీ కడ్డీ - ఎవరీ కళింగ పాపడు ?

(3) బోడిగుండు, బొప్పాయిగుండు
తిమ్మరాజుగారి దివిటీగుండు

—ఎవ రీ తిమ్మరాజు ? దివిటీగుం డంటే ఏమిటి ?

(4) ఏడవకు ఏడవకు వెర్రి నాగన్నా
ఏడిస్తె నీ కళ్లు నీలాలు గారు

(5) పిల్లి పిల్లి పిల్లి పిల్లల మర్రి
మర్రిక్రిందా వాడు తొర్రినాగన్నా !

—ఎవ రీ నాగన్న ? ఆంధ్రులకు పూర్వకాలంలో నాగన్న అనేపేరు సాధారణంగా ఉండేదికాబోలు.

(6) కొండా మీద వెండి గిన్నె
కొక్కి రాజు కాలు విరిగె

—ఎవ రీ కొక్కిరాజు ? సారంగధరుడని కొంద రనేమాట వాస్తవమేనా ?

(7) చందమామ యిల్లూ కట్టి
జాజిపూల తోటలోను
అమ్మా నేను చిన్నాదాన్ని
అల్లుడు వస్తే అంపాబోకు
ఢిల్లీకోట చల్లాగుంటె
దినానికి టంకం నే దెస్తా.

ఆంధ్రులకూ, ఢిల్లీసామ్రాజ్యానికీ సంబంధమున్నూ, దినానికి టంకం సంపాదించే పుఘ్గల సామర్థ్యమున్నూ యిందు గ్రహించవలెను.

కట్టుకథలలో ఒక విశిష్టగుణ మున్నది. అది బాలుర జ్ఞాపకశక్తిని వృద్ధిచేయడానికి ఏర్పాటైనది. శబ్దసంబంధంవల్లనూ, అర్థసంబంధంవల్లనూ గ్రహణధారణశక్తులు పెద్దవి కాగలవని సైకాలజి చెప్తూంది. ఇట్టి శబ్దార్థ సంబంధా లీ కథలలో గోచరిస్తవి. ఉదాహరణమునకు ఈగ కథ.

ఒక ఈగ ఇల్లలుకుతూ తన పేరు మరచిపోయిందట. సర్వదేశాలలోను సర్వచిక్కులూ విడగొట్టే పేదరాలి పెద్దమ్మ దగ్గరికి వెళుతుంది. తనకు తెలియదు కొడుకును అడగమంటుంది. ఈవిధంగా

ఒకరినిబట్టి ఒకరిని అడుగుతూపోయింది. చిట్టచివరకి ఈగ గుఱ్ఱం కడుపులో పిల్లదగ్గిరికి వెళ్ళి అడుగుతుంది, ఏమనీ— పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మ కొడకా, కొడుకు చేతిలో గొడ్డలీ, గొడ్డలి కొట్టే మానా, మానుమీ దుండే పక్షుల్లారా, పక్షులు తాగే నీళ్ళల్లారా, నీళ్ళలో వుండే చేపల్లారా, పట్టే పల్లెవాడా, వండే వంటలక్కా, తినే రాజా, రా జెక్కే గుఱ్ఱమా, గుఱ్ఱం కడుపులో పిల్లా, నా పే రేమిటి అని. గుఱ్ఱం పిల్ల నవ్వుతుంది. - ఈ ఈ ఈ అని. అప్పుడు ఈగకు తన పేరు జ్ఞాపకం వస్తుంది. ఈగకు ప్రాచీనరూపం "ఈ" అని పరిశోధకులు చెప్పుతారు. ఒకమారు పిల్లవాడు ఇట్టి కథ వింటే ఇక మరచిపోడు.

## బాల వాఙ్మయ కర్త తల్లిహృదయం

బాల వాఙ్మయంలో చాలా పాటలకూ, కథలకూ తల్లిహృదయమే కర్తృత్వం వహిస్తుంది. ఒక్కొక్కపట్టున బాలుర ఊహాశక్తి, లయజ్ఞానముకూడా కారణమై ఉండవచ్చు. మరిన్నీ బాల్యము కోల్పోని కవుల కల్పనాశక్తికూడా యిందుకు కారణమై ఉండవచ్చును.

ఇట్టి ప్రాచీన వాఙ్మయాన్ని, పునరుద్ధరించి పాఠశాలలో ప్రవేశ పెట్టవలసియున్నది. ఇంతేకాకుండా దీని ననుసరించి నూతన వాఙ్మయసృష్టికూడా జరగవలసియున్నది. బాల వాఙ్మయానికి తగిన వస్తువు దొరకదేమోనని మనము భయపడనక్కరలేదు. పురాణ పురుషులు పెక్కురు బాలురు మన కున్నారు. వారి బాల్యచరిత్రలు కథావస్తువుగా మనము గ్రహింపవచ్చును.

## అధిష్ఠానదేవత బాలకృష్ణుడు

బాల వాఙ్మయానికి అధిష్ఠానదేవత బాలకృష్ణుడు. తెలుగు దేశంలో బాలవాఙ్మయం కొంతవరకు బాలకృష్ణక్రీడలపై ఆధారపడి ఉన్నది. జోలలూ, మేలుకొలుపులూ, ఆటలూ, పాటలూ, కొంటె పనులు వర్ణించే కథలూ, గేయాలూ, బాలకృష్ణుణ్ణి ఉద్దేశించినవి పెక్కు లున్నవి.

మిగిలిన బాలవీరులు – ధ్రువుడు, ప్రహ్లాదుడు, చిరకారి, మార్కండేయుడు, రాముడు, బలరాముడు, పరశురాముడు, వామనుడు మొదలయినవాళ్లు ఉన్నారు. ఉచితమైన బాలభాషలో వీరి చరిత్రలు వ్రాస్తే బాల వాఙ్మయం కొంత ఏర్పడుతుంది.

## సూరి, సీతి, వెంకీ కథ

మరిన్నీ, ఇతరదేశపు బాల వాఙ్మయాలలో మనము ఈ కాలంలో పరిచయము సులభముగా సంపాదించవచ్చు. స్టీవెన్‌సన్, హాథారన్, గ్రిమ్, ఆండర్‌సన్ మున్నగువారు వ్రాసిన కథలూ, స్లైడ్ పుస్తకములు మనము ఆదర్శప్రాయంగా వుంచుకొని మన వాఙ్మయాన్ని వృద్ధిచేసికోవచ్చు.

నేను ముగ్గురు తెలుగు పిల్లల బాల్యజీవనమును "సూరీ – సీతీ – వెంకీ" అనే పేరుతో కొన్ని కథలుగా వ్రాశాను. ఒక కథాభాగం వినిపిస్తున్నాను.

"ముగ్గురూ వెళ్ళి నడవలో కూచున్నారు. సూరి రెండోతరగతి వాచకమూ. సీతి ఒకటోతరగతి వాచకమూ, వెంకి పలకా, పలక పుల్లా పట్టుకున్నారు."

సూరి పుస్తకం జాగ్రత్తగా అట్టవేసుకుంది. కొత్తబట్టలమీది బొమ్మలు అట్టలమీద అంటించుకొంది. పుస్తకంలో ఒక నెమలి కన్నూ, దాని దగ్గరే పువ్వారమూ పెట్టింది. "సీతాయి, చూడవే చూడవే ఈ నెమలికన్నే ఎంతపువ్వారం తినేసిందో. ఒకపిల్లనైనా పెట్టదు–పాడు" అంది సూరి. సీతి తన పుస్తకంలో నెమలి కన్నున్న పేజీ తీసి "నా పువ్వారం కొంచెం తింది నా నెమలికన్ను చూడే, అక్కా చూడే. ఎంత చిన్నపిల్లనిపెట్టిందో! చూడే ఒసే" అంటూ సీతి ఒకచిన్న నెమలి వెంట్రుక సూరికి చూపింది.

"అది పిల్లా ఏమి టమ్మా" అంది సూరి.

"కాదా ఏమి టమ్మా" అంది సీతి.

"నా కదియ్యాపూ" అంది వెంకి. వెంకిని మభ్యపెట్టి సీతికన్ను దాచేసుకుంది. సీతి పుస్తకము అంతా నలిగి చిరిగివుంది.

"అక్కయ్యా ఈపాఠం చెప్పవుటే నాకు" అంది సీతి.

"ఏం పాఠం" అని సూరి అడిగింది.

"కుక్క పాఠం" అంది సీతి.

"కుక్క పాఠ మేమిటి అసయ్యం. ఇంకా పాఠా ల్లేవూ" అంది సూరి.

"పిల్లి పాఠం, ఏనుగు పాఠం, సోమరిపిల్లవాడి పాఠం ఉన్నాయి" అంది సీతి.

"అ వేం పాఠాలే పాడు పాఠాలు. కథలు లేవూ" అని సూరి అడిగింది.

"నృగుని కథ, హరిశ్చంద్రుని కథ, ఎడ్వర్డు కథ, ఫ్రాంక్లిను కథ ఈ కథలున్నాయి" అంది సీతి.

"అ వేం కథలే, ఎంచక్కటి కథ లేమీా లేవూ మనం చెప్పుకునేలాంటివి" అంది సూరి.

"ఏమో నమ్మా నాకు తెలియదు" అంది సీతి.

"పోనీ పద్యం చదువు" అంది సూరి.

"చివ రున్నాయే పద్యాలు, చదవనా –"

"క్షేత్రంబు పురుషకారము
ధాత్రీశ్వర బీజ మరయ దైవము రెండున్
సూత్రపడ గూడెనేనియు –"

"ఏమో నమ్మా ఆపద్యాలు నాకు తెలియవు. అ వేం పద్యాలోగాని" అంది సూరి.

"సూరోయి, ఇదేం నాలుగో వాచకం" అంది సీతి.

"ఆసి దొంగా, ఇంకా నీ పుస్తకం అనుకుంటున్నాను" అంది సూరి.

"పోనీ నీ పుస్తకంలో కథలు చదవవే" అంది సీతి.

"నా పుస్తకమూ ఆలాగే ఉందమ్మా పాడు" అంది సూరి.

"ఒకటి చదవ్వే పోనీ" అంది సీతి.

"అయితే చదువుతా విను" అని సూరి ఇలా చదివింది.

"పూర్వకాలంబున నుజ్జయినినా బట్టణం బొండు కలదు..."

"బొండు బొండు బొం డేమిటే సూరి" అంది సీత.

"వినవే మరి" అని సూరి చదవడం సాగించింది.

"అందు వీరసేనుండను భూపాలేంద్రుండు రాజ్యము సేయుచుండెను. ఆతనికి జంద్రకళయను పేరం బరగు కళత్రంబు సకల గుణోపేత..."

"పేత పేత పేతేమిటి పీత" అంది సీత.

''పోనీ అమ్మా నే చదవను'' అని సూరి పుస్తకము మూసేసింది.

నేను వ్రాసిన లక్క-పిడతలలోంచి ఒక గేయం:

బాజాలురా నాన్న బాజాలు
బాజాలు వచ్చేయి బాజాలు
బాజాలతో వచ్చె పల్లకీ అదుగో
పల్లకీలో ఉంది పార్వతీదేవి
పార్వతీదేవికీ జేజేలు పెట్టు
బాజాలురా నాన్న బాజాలు
బాజాలు వచ్చేయి బాజాలు.

ఇంకా బాల వాఙ్మయాన్ని సృజించిన, సృజిస్తున్న గ్రంథ కర్తలు మనలో ఉన్నారు. గురజాడ అప్పారావుగారి ఆడపిల్లల పాట చిత్తగించండి :-

''ఆటల పాటల పేటికలారా
కమ్మని మాటల కొమ్మల్లారా
కలువల కన్నుల కన్నెల్లారా
పిల్లల గన్న తల్లుల్లారా
విన్నారమ్మా ఈ కథను :-
కొండల నడుమను కోనొకటుంది
కోనకి నడుమ కొలనొకటుంది
కొలని గట్టున కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ.

ఏయే ఋతువుల పూచే పువ్వుల
ఆయా ఋతువుల అందించి
బంగరు దుర్గను బక్తితో కొలిచెను
పుత్తడిబొమ్మ పూర్ణమ్మ.''

పసితనమందు పిల్లలకు యిట్టి సారస్వతముతో పరిచయము కలిగినప్పుడే, వారి జీవితవృక్షానికి సరియైన దోహద మేర్పడుతుంది.

''ఫక్కున సూర్యుడు నవ్వే డంటే
పట్టపగలు ఈ లోకముకు

ఫక్కున చంద్రుడు నవ్వే డంటే
చల్లని వెన్నెల జగములకు

ఫక్కున పాపాయి నవ్వే డంటే
పరమానందం నీకూ నాకూ

నవ్వడ మెందుకు నిజము పలకవే
అవునో కాదో అలివేణీ.''



# బాల సాహిత్యం

వెనకటి కాలంనుంచీ తెలుగుదేశంలో బాల బాలికలకోసం ఉద్దేశించబడ్డ సారస్వతం ప్రచారంలో వున్నది. కాని కవులూ, గ్రంథకర్తలూ కావ్యనాటకాదులు తాటాకులమీద వ్రాసినట్లుగా బాల సారస్వతం వ్రాసి వుంచలేదు. వ్రాసివుంచిన భాగ కూడా లేకపోలేదు. కాని అట్టి గ్రంథాలు పెద్దలు తమ వశం చేసుకొని, వాటిని తమ గ్రంథాలుగా వాడుకొంటున్నారు. ప్రాచీనులు బాలుర కొరకని ఉద్దేశించిన గ్రంథాలు కొన్ని ఈ విధంగా పెద్దల పాలైనవి. ఇట్లా జరగకుండానే ఉంటే, బాలుర కింకా చాలినంత సారస్వతం వారి ఉపయోగంలో ఉండేది.

లిఖితరూపంలో లేని సారస్వతం ఆనోటినుంచి ఆనోటికి పరంపరాగతంగా నేటివరకూ వచ్చినది. తాతలూ, తండ్రులూ, తల్లులూ, ముసలమ్మలూ తమ వశంలో ఉన్న బాలసారస్వతాన్ని పిల్లలవశం చేసేవారు. ఇంగ్లీషు చదువులు వచ్చాక, మనకు మన పెద్ద లిచ్చిన ఆస్తి మనం కాపాడుకోవడంలేదు. పొరుగింటి పుల్ల కూరమీద మనకు మనసుపోయింది. ఇందువల్ల ప్రాచీనకాలంనుంచి నేటి కాలంవరకూ పరంపరాగతంగా వస్తూన్న బాల సారస్వతం నశించే పరిస్థితులు తటస్థించాయి. ఇప్పుడు వాటిని ఉద్ధరించి నిల బెట్టే ఉద్దేశముతో లిఖితంచేసి పుస్తకరూపంలోనికి తేవాలని ప్రయత్నిస్తున్నాము. ఈ విషయంలోకూడా మన మంత పట్టుదల చూపడంలేదు.

నాటుకథలు (Folk tales), నీతి కథలు (Fables), అద్భుత కథలు (Fairy tales), బాలగేయాలు (Childrens rhymes), అభినయగీతాలు (Action songs), సమస్యలు, పొడుపు కథలు (Riddles) మున్నగునవి లిఖితముకాని బాల సారస్వతంలో చేరుతవి.

నాటుకథలు కొన్ని— జాతీయ కథలనే పేరుతో రామా కంపెనీవారు ప్రచురించారు. బులుసు పాపయ్యశాస్త్రిగారు కొన్ని ప్రకటించారు. కొన్ని వాచకాలలోని కెక్కినవి. కొన్నింటిని "బాల" పత్రిక ప్రకటించింది. కొన్ని ముసళ్ళవద్దనూ, బాలురవద్దనూ నిలిచి ఉన్నవి.

అద్భుత కథలు కొన్ని పైని పేర్కొన్న జాతీయ కథలనే గ్రంథములో నున్నవి. తెలుగు అద్భుత కథలు గ్రంథరూపములోకి వచ్చినట్లు కనబడదు.

బాల గేయాలూ, స్త్రీల పాటలూ రాజమహేంద్రవరం ప్రాంతంలో ఉన్న నేదునూరి గంగాధరంగారు ఊరూరూ తిరిగి వందలకొద్ది సమకూర్చారు. అవి యింకా గ్రంథరూపాన్ని పొంద లేదు. బాల గీతావళి, గీతా మంజరి, పిల్లల పాటలు, పాత పాటలు అనే పేళ్ళతో ప్రచురించబడిన చిన్న గ్రంథములలో ఈ గేయాలు కొన్ని ఉన్నవి.

తెలుగు దేశములోని ప్రతిగ్రామానికీ వెళ్ళి, అక్కడి ముసళ్ళ దగ్గిరనుంచీ, పిల్లలదగ్గిరనుంచీ కథలూ, గేయాలూ, సంగ్రహించ వచ్చును. ఇంకా మిలిగియున్న బాల సారస్వతాన్ని సంపాదించ డానికిది ఒక మార్గం లేదా బాలవంటి పత్రికలు గ్రామస్థులనూ, పిల్లలనూ ప్రోత్సహించి, అట్టికథలూ, పాటలూ మొదలైనవి తెప్పించి ప్రకటించవచ్చును. ఇట్టి కథలూ, పాటలూ ఉన్న దున్నట్లు వ్రాసు కొని ప్రకటించవలసినదే కాని, స్వంతకవిత్వాలు పెట్టకూడదనే సంగతి గ్రహించాలి.

ఇక లిఖితరూపము వహించి, గ్రంథస్థమై ఉన్న బాలుర గ్రంథాల్లో ముఖ్యముగా చెప్పుకోదగ్గది పంచతంత్రము. ఇది బాలుర కొరకు ప్రత్యేకంగా ఉద్దేశింపబడ్డ గ్రంథము. మన దౌర్భాగ్యంవల్ల దీనిని పెద్దలు తమ వశం చేసుకొని బాలురకు దక్క కుండా చేశారు. దీ ని ప్రాచీన కవు లిద్దరు పద్యకావ్యాలుగా తయారు చేసి పాడుచేశారు. చిన్నయసూరి, వీరేశలింగము, వెంకట

రత్నము బాలురకు అలవిగాని భాషలో వచనముగా వ్రాసి, పండితులకుమాత్రమే పనికివచ్చే గ్రంథంగా చేసుకొన్నారు. పంచతంత్రంలో కథలన్నీ బాలురకు పనికివచ్చే నీతికథలు. అస లవి బాలురకు విష్ణుశర్మ చెప్పిన కథలు. బాలురకు విద్యబోధించే పద్ధతులు ఎట్టివై ఉండాలో విష్ణుశర్మకు బాగా తెలుసును. మన తెలుగు గ్రంథకర్తల దృష్టిలో బాలురే లేరు, వారి దృష్టిలో ఉన్నది - ఆత్మపాండిత్యప్రకర్ష ఒక్కటే. ఇట్టివే ఈసప్ కథలున్నూ - వీటినికూడా పద్యాల్లో బంధించిన్నీ, కఠిన కృతక వచనాల్లో బంధించిన్నీ బాలురకు పనికిరాకుండా చేశారు. ఇట్టివే విక్రమార్క కథలు, బేతాళ కథలు, భోజ కథలు మొదలైనవి.

వెనుకటి కాలంలో స్త్రీలనూ, బాలురనూ దృష్టిలోపెట్టుకొని, వారికి పనికివచ్చేటట్టు గ్రంథములు వ్రాసిన బుద్ధిమంతులు లేకపోలేదు. వారిలో ఎన్నుకోదగ్గ పండితుడు రావిపాటి గురుమూర్తి శాస్త్రి. పంచతంత్రము, ద్వాత్రింశ త్సాలభంజికల కథలు ఈయన పిల్లలకోసమే వ్రాశాడు. గద్యచింతామణి చూస్తే పలువురు పండితులు వెనుకటికాలంలో పిల్లల కుచితమైన గ్రంథాలు వ్రాశారని గ్రహించవచ్చును. నే డట్టి సంప్రదాయం మారడంవల్ల పిల్లలకు తీరనినష్టం సంభవించింది. వెనుకటి పుస్తకాలు మళ్ళీ అచ్చుపడి బాలుర చేతులలోని కెక్కవలసియున్నది.

మరిన్నీ, పెద్దల పుస్తకాలుకూడా పిల్లలకు పనికివచ్చేవిధంగా సంస్కరించి వ్రాయవలసియున్నది. అట్టి పనికి ఎవరూ, యింకా పూనుకోలేదు. భాష పిల్లలభాషగాను అనగా పిల్లల కర్థమయ్యే భాషగాను, విషయము పిల్లల అనుభవాలకు సరిపోయేటట్టుగాను ఉండాలి.

ఇట్లా మార్చదగ్గ మన కావ్యాలన్నీ న్యాయానికి అద్భుత కథలే. మానవ జీవితమును దేశకాలానుగుణంగా ఉన్నదున్నట్లు వర్ణించిన కావ్యాలు మనకులేవు. మనుచరిత్ర, వసుచరిత్ర, కళాపూర్ణోదయం, ప్రభావతీ ప్రద్యుమ్నం ఇత్యాది గ్రంథాల్లో గంధర్వులు వస్తారు.

పర్వతాలూ, నదులూ, పక్షులూ, జంతువులూ మనుష్యులవలె మాట్లాడతారు. మనుష్యులవలె ప్రవర్తిస్తారు. ఈ కథల్లో అనేక విధములైన గారడీలు జరుగుతవి. మనుష్యులు జంతువు లవుతారు. దేవతలు మనుష్యు లవుతారు. ఈ లక్షణాలన్నీ అద్భుత కథల లక్షణాలే.

ఇక మన పురాణ కథలుకూడా అద్భుత కథలే. అర్జునుడి భూప్రదక్షిణం, భీముడు రాక్షసులను చంపడం, హనుమంతుడి సాహస కార్యాలు, రాముడి అమానుషక్రియలు మొదలైనవన్నీ పిల్లలను సంతోషపెట్టే విషయాలే.

ఇట్లే నేటికాలపు యాత్రలు, సాహస కార్యాలు కథలుగా వ్రాసి పిల్లల కందియ్యవచ్చు.

సౌందర్యగ్రహణము పెద్దలకువలెనే పిల్లలూ చేస్తారు. కావ్యానందాన్ని పెద్దలకువలెనే పిల్లలూ పొందుతారు. అట్లా జరగడానికి విషయమూ, భాషా వారి అందుబాటులో ఉండాలి. వారి చిత్తవృత్తుల కనుగుణంగా రచన జరగాలి. గ్రంథస్థములు కాని నాటుకథలు మొదలైనవి ఆ విధంగానే ఉన్నాయి. ఇక ముందు వ్రాసే గ్రంథాలుకూడా అట్లే ఉండాలి.

చిన్నపిల్లల మనస్సును ఆకర్షించే ప్రధానరసం అద్భుతరసం. వీర, కరుణ, శాంత, హాస్యరసాలుకూడా పిల్లల నాకర్షిస్తాయి. శృంగార, భయానక, బీభత్సాలు పిల్లలకు పనికిరావు.

ఏడు సంవత్సరముల వయస్సు వచ్చేవరకూ పిల్లలు ఆట పాటలతో కాలక్షేపం చేస్తారు. ఇట్టి ఆటపాటలద్వారానే వారికి ఇంద్రియశిక్షణ జరుగుతుంది. ఇంద్రియములతో జ్ఞానార్జన చేసుకుంటారు. తరువాత వీరికి విద్యాభ్యాసం ప్రారంభంకావలసి ఉంటుంది. ధారణాశక్తిని వృద్ధిచేసుకోవడం, పరిశీలనాశక్తిని వృద్ధి చేసుకోవడంద్వారా విద్యాకార్యాలు జరుగుతవి.

చిన్నపిల్లలకు తగిన గ్రంథాలు వ్రాయడం గ్రంథకర్తల మనుకునేవారి విధి. చిన్నపిల్లలకోసం గ్రంథాలు వ్రాయడంలో

న్యూనత లేదని యీ క్రింది Tolstoy వాక్యాలు చదివితే బోధపడుతుంది.

To compose a fairy tale or a lullaby or to make a sketch which will delight dozens of generations or millions of children or adults is incomparably more important and more fruitful than to compose a novel or a symphony or paint a picture of the sort which will divert some members of the wealthy classes for a short time and then be for ever forgotten.

"ఒక నవల రచించుటవల్లను, వాద్యకృతిని కూర్చుటవల్లను, చిత్రమును గీయుటవల్లను ధనవర్గమునకు చెందిన కొద్దిమంది మాత్రము తాత్కాలికానందము జెంది, తరువాత వాటిని విస్మరించుదురు. అంతకన్న గొప్పవిషయము ఒక అద్భుత కథనుగాని, జోలపాటనుగాని, ఒక స్కెచ్చినిగాని వ్రాసిన, వేలాది చిన్నలు, పెద్దలు తరతరాలు ఆనందింతురు. ఇట్టి కార్యము ఫలవంతముకూడ."

చిన్నపిల్లలచేత వారికోసం ఉద్దేశింపబడ్డ గ్రంథాలు చదివించడం తల్లిదండ్రుల విధి.

ఎవడైతే, చిన్నపిల్లల పాటలు విని హర్షించడో, ఎవడైతే అట్టి పాటలు వినడానికి ఏవగించుకుంటాడో, ఎవడైతే చిన్నపిల్లలను వారి పాటలు పాడుకోకుండా అరికట్టుతాడో వాడు పిల్లల అభిరుచు లెరుగడు.



73

# యక్షగానము

యక్షగాన మంటే ఏమిటి? బ్రౌణ్యా నిఘంటువులో యక్షగాన మంటే ఒకవిధమైన పాటగా నిర్వచింపబడ్డది, కాని నాటక మనలేదు.

అప్పకవీయములో యక్షగానమునుగురించి వ్రాయబడ్డది. అందు అర్థచంద్రికలు, త్రిపుట, జంపె, ఆటతాళము 'వీన యక్షగాన ప్రబంధంబు లతుకవచ్చు' అని అప్పకవి వ్రాసినాడు. అనగా, పాటలు గల ఒక ప్రబంధమని అప్పకవి అభిప్రాయమైనట్లు మన మూహించవచ్చును.

శ్రీనాథుడు దక్షవాటీమహాపురమును భీమఖండములో వర్ణిస్తూ, "కీర్తి తు రెడ్డాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి" అన్నాడు. శ్రీనాథుని కాలమునాటికికూడా యక్షగానములు పాటలే అని మన మనుకొనవచ్చును. మరిన్నీ, శ్రీనాథుడే కాశీఖండములో,

"వల్లకి చక్కి కాహళము వంశము ఢక్క హుడుక్క ఝర్ఝరుల్
ఝల్లరి యాదిగా గలుగు శబ్దపరంపర తాళశబ్దమై
యుల్లసిలం బ్రబంధముల గొప్పుగ నాడుచు రంగవేదిపై
బల్లవపాణు లీశ్వరుని బంటమహీశులు పూజసేయగన్".

అని వ్రాసినాడు. ఈ ప్రబంధములు ఎట్టివో భీమఖండమున వర్ణింపబడ్డవి.

భీమఖండము ప్రథమాశ్వాసములో భీమేశ్వరుని కొలువు ఈ రీతిగా వర్ణింపబడ్డది.

"భీమేశ్వరుండు......అల్లయవేమభూపాలరాజ్యభారధురంధరుడై బెండపూ డన్నయామాత్యుడు గట్టించిన మొగసాలవాకిటి మహోత్సవమండపంబునందు బేరోలగంబుండి కుండలీదండలాసక ప్రేరణీప్రేంఖణపింధుకందుకధమాళిచేలమతల్లీ హల్లీసకాదినృత్యంబు లవలోకింపుచు, బంతంబు లవధరింపుచు మేలంబు లాలకించుచు,

జంపూచాటునాటకోదాహరణజయఘోషచక్రవాళ చతుర్భద్రచతు రాశ్రిప్రబంధంబు లాకర్ణింపుచు - ఇందలి నాటకప్రబంధములు యక్షగాన ప్రబంధములు కావచ్చు.

యక్షగానాలు పాడేటప్పుడు పల్లవపాణులు వేర్వేరు వాద్యముల తాళములకు ఆడేవారనికూడా ఊహించవలసిఉన్నది.

అయ్యగారి వీరకవి తాను వ్రాసిన చిత్రాంగద విలాపమనే యక్షగానములో ఈ విధముగా చెప్పినాడు.

"... ... ... నాకు దోచు
నట్టు లానందమొప్ప ధర్మాంగచరిత
మనగ చిత్రాంగదవిలాసమనగ యక్ష
గాన మొనరింతు వేషముల్గట్టి జనులు
పాడి వినిపింప బుణ్యసంపద ఘటింప"

దీనినిబట్టి యక్షగానములను జనులు వేషములుగట్టి పాడి వినిపించేవారని తేటపడుతోంది. ఈ కాలపు నాటకాలవలె గాక ఆకాలమున ఎవరో ఒకరు వేషాలు వేసుకొని కథఅంతా పాడేవారని ఊహ.

ఉత్తర రామచరిత్రము వ్రాసిన కంకంటి పాపరాజు విష్ణుమాయావిలాస మనే యక్షగానము వ్రాశాడు. అందులో ఇట్లున్నది :

"కంకంటి అప్పనాగ్రణి కుమారుండు
పంకజలోచన పంచబాణుండు
పాపరా జొనరించె బహుపదార్థముల
వ్యాపించి విష్ణుమాయావిలాసంబు
భూమిని తిలకించి బుధులెల్ల బొగడ
ఆమిత్రతారాభమై విభాసిల్ల."

దీనినిబట్టి చూచినా, జనులు వేషములుగట్టి పాడగా బుధులు చూచి ఆనందించేవారని తోస్తోంది.

మొట్టమొదటి రోజుల్లో కూచిపూడి భాగవతులు వేసే "భామ వేషం" ఇట్టి యక్షగానమని నా ఊహ. భామవేషంలో కథ పారిజాత ప్రసంగము తనకు నారదు డిచ్చిన పుష్పము శ్రీకృష్ణుడు రుక్మిణి కీయగా సత్యభామ విని కోపించుట, విరహముపాలవుట, కృష్ణునిక సందేశమంపుట, కృష్ణునితో కలుసుకొనుట, అలక తీరుట. ఇందులో వేషము కట్టేది సత్యభామ ఒక్కతే. ప్రక్కనున్న బ్రాహ్మడు సమయానుకూలంగా చెలికత్తె అవుతాడు, వైద్యుడౌతాడు, హాస్యగాడౌతాడు. ఏ పాత్రబడితే ఆ పాత్ర అవుతాడు. చిట్టచివరకుమాత్రం శ్రీకృష్ణవేషం కనిపిస్తుంది; కాని శ్రీకృష్ణుడు మాట్లాడడు.

ఈ భామవేషమునే పారిజాతమును వ్రాసిన సిద్ధేంద్రయోగి తన గ్రంథమును శృంగారప్రబంధ మన్నాడు. యక్షగానాలను ప్రబంధము లనడం పరిపాటికాబట్టి, ఈ భామవేషం యక్షగానంగా మనము భావించవచ్చును.

పై విషయములనుబట్టి, యక్షగానమంటే పాటలతో కూడిన ఒక ప్రబంధమనిన్నీ, దానిని ఎవరో ఒకరు వేషము వేసుకొని పాడుతూ ఆడేవారనిన్నీ బోధపడుతోంది.

ఇప్పుడు యక్షగానమంటే, వీధినాటకమని మనము వాడుతున్నాము. కాని, యక్షగానము వేసు, నాటకము వేసు. తంజావూరు రాజులకాలములో నాటకాలూ వ్రాశారు. యక్షగానాలూ వ్రాశారు. నాటకాలలో ఒకరిద్దరే కాకుండా, అందరూ వేషాలు వేసేవారనిన్నీ, అందరూ పాటలూ, పద్యాలూ పాడుతూ, ఆడుతూ ఒక మాదిరి ఈ కాలపు నాటకాలలాగే నాటకమాడేవారనిన్నీ తోస్తున్నది. ఇంతేకాకుండా, యక్షగానాలలో అంకవిభాగ ముండదు. ప్రబంధముల మాదిరిగానే ఇష్టదేవతా ప్రార్థనము, సుకవి భూషణము, కుకవి నింద, షష్ఠ్యంతములు, కథాప్రవేశము ఉంటవి. నాటకాలలో అట్లుగాక, అంక విభాగముకూడా ఉండవచ్చును. త్యాగరాజ వినోదచిత్ర ప్రబంధమనే నాటకము ఆరంక

ములు గలది. ఈ విషయమై ఇదమిత్థమని యింకా ఏమీ చెప్ప జాలను.

అక్కనామాత్యుడు వ్రాసిన బాలకృష్ణలీలావిలాస మనే నాటకములో,

"కాముని గన్న చక్కని 'బాలకృష్ణ
లీలా విలాస లాలిత నాటకంబు'
భూలోకమున శుభంబుల పొల్పుకూర
సరలిలో భరతశాస్త్ర ప్రవీణతను
పరగంగ కన్నుల పండువుగాక
ఆ చతుర్ముఖ నిర్మితావనియందు..."

ఈ నాటకా లయితేనేమి, యక్షగానా లైతేనేమి భరత శాస్త్ర ప్రవీణత చూపించడంకోసనమే ఉద్దేశింపబడినవి.

ఈ మధ్య కూచిపూడి భాగవతు లాడే ప్రహ్లాద, రామాయ ణాదులు యక్షగానాలు కావు. వాటిని వీధి నాటకా లనడమే యుక్తము. ఇవి యక్షగానాలు పరిణమించగా పుట్టియుండ వచ్చును. లేదా. స్వతంత్రముగా పుట్టియుండవచ్చును. ఆంధ్ర పండితు డొకడు దక్షిణాదికి వెళ్ళి ప్రహ్లాదనాటకము ఆడే, పాడే విధము నేర్చుకొనివచ్చి ఆంధ్రదేశములో ప్రవేశపెట్టాడనీ, అప్పటి నుండి ఆ నాటక మాడుతు న్నారనీ, క్రమక్రమముగా అట్టి నాటక ములు విరచించబడి వీధినాటకాలుగా ఆడబడుతున్నవనీ దివి తాలూకాలో కొందరు కుశీలవులు నాతో చెప్పారు.

1624 ప్రాంతమందున్న గోకులపాటి కూర్మనాథకవి మృత్యుంజయవిలాస మనే యక్షగానము వ్రాశాడు. అది అతి ప్రౌఢముగా ఉన్నది.

"వైకుంఠ వామన వారిజనాభ,
నీ కంకితముగ నా నేర్చినరీతి
మృత్యుంజయ విలాస మృదుతర కావ్య,

మత్యంత భక్తితో యక్షగానంబు
రచియించి నీకు నర్పణ సేయదలచి''-

అని ఒక చోట తన గ్రంథాన్ని యక్షగాన మన్నాడు.

''అత్యంతభక్తితో నంకితంబైన,
మృత్యుంజయ విలాస మృదుల నాటకము
హరి కంకితంబౌట హరకథ యాట''-

అని యింకొకచోట దానినే నాటకమనీ అన్నాడు.

యక్షగానమన్నా, నాటకమన్నా ఒకటిగా భావించారనడాని కిది నిదర్శనము.

పగటివేషాలు, తోలుబొమ్మలు, యక్షగానాలు మన ఆంధ్ర దేశమున నాటకాలు పరిణమించిన విధమై ఉండవచ్చును. చిట్ట చివరకి యక్షగానాలు వీధినాటకాలై యుండవచ్చును.

ఒక సంస్కృత సంపర్కముగాని, ఒక ఇంగ్లీషు సొక్కుగాని లేకుండా జాతీయపద్ధతి పరిణమించిన ఈ నాటకాలలో ఉపజ్ఞ, కళా, కౌశలము, చాతుర్యము, జాతీయత బహుళముగా ఉన్నవి. సంగీత సాహిత్యాభినయముల కాటపట్టులై ఉన్నవి. ఈ కాలపు నాటకాలకంటె మనోహరముగా ఉంటవి. అందు జీవద్భాషలో జాతీయముగా సంభాషణ జరుగుతుంది.

ఇట్టి నాటకములకున్నూ, యక్షగానములకున్నూ ఇంత వరకూ మన కవుల చరిత్రలలోగాని, వాఙ్మయ చరిత్రలలోగాని స్థానము లభించలేదు సరిగదా, యివి పండితుల ఈసడింపులకు పాలౌతున్నవి. పూర్వకవులూ, పండితులూ వీటిని ఆదరించేవారే గాని, అనాదరణభావంతో చూచేవారు కారు. ఈ కాలపు కొందరు పండితులుమాత్రమే వీటికి సారస్వతమున తావు లేదంటున్నారు. మన సారస్వతము బహుముఖములుగా వ్యాపించి ఉన్నది. అటు పండితులకే కాకుండా, యిటు పామరులకూ, పిల్లలకూ స్త్రీలకూ కూడా ఉచితగ్రంథములు పూర్వులు రచించియున్నారు. ప్రబంధ

ములూ, పురాణములూ పండితులకైతే, పాటలూ, పదములూ, కీర్తనలూ మొదలైనవి తదితరులకు. మహాకవు లిటు పండితులకూ, అటు ప్రజాసామాన్యమునకూ కావ్యరసామృతం దోసిళ్ళాది తాగేందుకు అనేకవిధాల గ్రంథాలు వ్రాశారు.

శేకుమళ్ళ అచ్యుతరావుగారు వ్రాసిన విజయనగరసామ్రాజ్య మందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రకు పీఠిక వ్రాస్తూ శ్రీజయంతి రామయ్యపంతులుగారు ఈ విధంగా వ్రాశారు :

" It is true there are a number of short dramatic pieces preserved in the Tanjore palace library, some of them being composed by the Naick kings themselves but they are of the class of small English operas and do not aspire to the rank of literature."

"తంజావూరి నగరి భాండాగారములో పదిలపరచబడి చిన్న నాటకము లున్నమాట వాస్తవమే. ఇందు కొన్ని నాయక రాజులు స్వయముగా వ్రాసినవి. కాని, అవి చిన్న ఇంగ్లీషు ఒపెరా (సంగీతనాటకము) జాతికి చెందుతవి. వాటికి వాఙ్మయంలో స్థాన ముండదు."

జయంతి రామయ్యగారు పేర్కొన్నట్లు ఇవి చిన్ననాటక ములే కావు. ఇందులో చిన్నవీ, పెద్దవీకూడా ఉన్నవి. పరిషత్తుతరఫున అచ్చువేసిన రంగాజమ్మ వ్రాసిన మన్నారుదాసవిలాసనాటకము డెమ్మీసైజున 53 పేజీలు పట్టింది. కూచిపూడివారాడే ప్రహ్లాద నాటకం పూర్తిగా ప్రదర్శించడానికి ఏడురాత్రులు పడుతుందట! చిన్నది, పెద్దది అనే తారతమ్యాలనుబట్టి నాటకం విలువ ఎంచ కూడదుగదా !

ఇంతేకాకుండా, ఈ నాటకాలు తంజావూరు భాండాగార మందే ఉన్నట్లు వ్రాశారు. పరిషత్తు భాండాగారంలో, ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలోకూడా ఉన్నవన్న సంగతి వారికి తెలుసును. ఇవే కాక, చాలా నాటకాలు అచ్చుపడి ఉన్నవికూడాను.

వారు పీఠిక వ్రాసిన వాఙ్మయ చరిత్రలోనే హయలక్షణ సారసంగ్రహాన్ని గురించికూడా వ్రాయబడి ఉన్నది. గుర్రాలమీద వ్రాసిన పద్యాలూ, నిఘంటువులూ వీరికి సారస్వత మైనప్పుడు, ఈ నాటకాలు చేసుకొన్న దురదృష్ట మేమిటో వీటికి సారస్వత శ్రేణిలో విస్తరి దొరక్కపోవడానికి.

ఈ యక్షగానాలు సారస్వతశాఖ అనీ - ప్రశస్తమయిన సారస్వతశాఖ అనీ, దీనిని ఈసడించరాదనీ ఇప్పుడు నిరూపిస్తాను.

ఈ యక్షగానాలు వ్రాసినవారిలో మహాకవులూ, గొప్ప పండితులూ ఉన్నారు. వారిలో కొందరి పేళ్ళూ, వారు వ్రాసిన గ్రంథాలు కొన్నీ ఉదాహరిస్తున్నాను.

నేను తెలుసుకొన్నంతవరకు మొట్టమొదటి యక్షగానం 1530 ప్రాంతమున రచింపబడ్డది. నాటినుండి, నేటివరకున్నూ యక్షగానాలు రాస్తూనే ఉన్నాను. మనముమాత్రము వాటిని పరికించడం లేదు.

పింగళి సూరన్నకు పూర్వమందున్న చెన్నశౌరి అనే కవిని గూర్చి ఈ విధముగా నారసింహ పురాణమందున్నది:

"ఆ మంత్రిపుంగవుం డష్టభాషాకవి
 వర్యుఁడై పొగడొందె వసుధయందు
ద్విపదగా నారసింహపురాణ మొనరించి
 భక్తి నహోబల భర్త కిచ్చె
బాలభారత మంధ్రభాషను వచన కా
 వ్యంబు చేసెను గవీశ్వరులు మెచ్చ
సౌరభిచరితంబు జక్కుల కథ జెప్పె
 లాలిత నవరసాలంకృతముగ
మరియు బెక్కు కృతుల్ పటుమతి రచించె
ఖ్యాతి నరసింగరాయలచేత గొనియె
నగ్రహారంబులును వివిధార్థములును
నెలసె గొండమ బెండ్లియై విభవమెసగ"

సౌరభి అనే యక్షగానము వ్రాసిన చెన్నమంత్రి సామాన్యుడు కాడుగదా!

రఘునాథరాయలు కృతినందిన గ్రంథములను చెప్పుతూ కృష్ణాధ్వరి ఇట్లు చెప్పాడు: 'కల్యాణ కౌముదీ కందర్పనాటక, కన్యోద్వాహన బద్ధకంకణుండు' అని.

ఈ కౌముదీనాటకము ఎలకూచి బాలసరస్వతి వ్రాసినదై ఉండవచ్చును. ఎందువల్లనంటారా? ఎలకూచి బాలసరస్వతి భట్టమహోపాధ్యాయుడు రాఘవ యాదవ పాండవీయములో "కవి సమీహితరంగ కౌముదీనామ నాటక విధాన ప్రతిష్ఠాఘనుండ" అని తన్నుగూర్చి చెప్పుకొన్నాడు. ఇతడు సామాన్యుడు కాడుకదా! నిరంకుశోపాఖ్యానమును వ్రాసి కృష్ణదేవరాయల ఆస్థానములో అష్టదిగ్గజములలో నొకడుగా పేరందిన కందుకూరి రుద్రయ్య జనార్ద నాంకితముగా 'సుగ్రీవ విజయ'మనే యక్షగానము వ్రాశాడు. ఈ పుస్తకము అచ్చుపడి ప్రచారములో ఉన్నది.

అప్పకవీయమును వ్రాసిన కాకునూ ర్యప్పకవి తన్నుగూర్చి యీవిధముగా వ్రాసుకున్నాడు:

"లలిత కవికల్ప కాఖ్యాన లక్షణంబు
మహిత సాధ్వీజనౌఘధర్మద్విపదయు
అంబికావాదనామక యక్షగాన
కృతియు జేసితి కాకునూరి కులయప్ప."

అప్పకవియంతటివాడు అంబికావాద మనే యక్షగానం వ్రాశాడు.

రాజయోగసారము, వేంకటాచలమాహాత్మ్యము, ద్విపద భాగవతము వ్రాసి శ్రీకృష్ణుని ప్రత్యక్షము చేసికొన్న తరిగొండ వెంకమ్మ శివవిలాసమనే యక్షగానం వ్రాసినట్లు ఈ విధంగా చెప్పుకొన్నది:

"సరసత శివవిలాసం బను కథను
కర మర్థితో యక్షగానంబు చేసి
పరమభక్తిని వీరభద్రుని కొసగ"

మిత్రవిందా పరిణయమును వ్రాసిన కుందుర్తి వెంకటాచల పతినిగూర్చి:

"ఘటియించినావు ద్రాక్షాపాకముగ బహు
నాటకంబులు సమున్నతి జెలంగ"

అని వ్రాయబడ్డది. ఇతడు భారత, భాగవత, రామాయణ ములు వచనకావ్యములుగా వ్రాసిన కవి.

కంకంటి పాపరాజు, ఉత్తర రామాయణకర్త, తన్నుగూర్చి తన యిష్టదైవము పల్కినట్లు ఇట్లు చెప్పుకొన్నాడు:

"శ్రీవెలయ మున్ను విష్ణుమాయావిలాస
యక్షగానంబు మాకె సమర్పణముగ
జేసి తది యాదిగా మేము నీ సుధాను
సారి వాక్కుల జొక్కియున్నార మనఘ."

దేవుళ్ళుకూడా యక్షగానా లంగీకరించినారు గదా!

ఆంధ్రకాళిదాసు బిరుదు చోళేంద్రునివల్ల పొందినట్టిన్నీ, శంకర విజయమును రచించినట్టిన్నీ ఆలూరి కుప్పన్న తన్నుగూర్చి కృతిపతి చెప్పినట్లు ఈ విధంగా వ్రాసుకొన్నాడు:

"పరగ రామాయణ భాగవతంబులు
యక్షగానముచేసి తద్భుతముగ."

పార్థసారథి విజయమనే యక్షగానంకూడా యితడు వ్రాసినదే.

బలభద్రవిజయం వ్రాసిన సోమన్నకవి తన సంగతి ఈ విధంగా చెప్పుకున్నాడు:

"సుమహితంబుగ నేను సోమనాహ్వాయుడ
బల్లాణచరితంబు పద్యకావ్యముగ
నెల్లవారలు మెచ్చ నే చేసినాడ.
అల శివరాత్రిమహత్వము తెనుగు
వలనుగా వచనకావ్యము చేసినాడ.

11

లక్షణాదేవి కళ్యాణంబు ద్విపద
యక్షగానంబుగా నమరించినాడ.
గంభీరమగు యక్షగానంబు శుకుని
రంభసంవాదంబు రచియించినాడ."

ప్రబంధకవి అయిన యీతడు "లక్షణా పరిణయమూ", "శుక రంభా సంవాదమూ" అనే యక్షగానాలు వ్రాసినట్లు స్పష్టము.

మదనమోహినీ విలాసమూ, కాళిందీ పరిణయమూ, ఉత్తర హరిశ్చంద్ర కథా అనే ప్రబంధములు వ్రాసిన "తక్కెళ్ళపాటి లింగన్న" ఈ విధముగా చెప్పుకున్నాడు:

"ఆ వెన్క విద్యుత్ప్రభావిలాసము వేడ్క
ఘటియించితిని యక్షగానరీతి."

శేషధర్మములు వ్రాసిన గురురాజకవి సంగీత విద్వాంసుడు. ఇతడు "ప్రతి పద్యయమక చిత్రశ్లేష పద్మావతీపరిణయనామ దివ్య నాటకంబును, అనిరుద్ధ చరితాహ్వాయాంధ్రనాటకంబును" వ్రాసినట్లు చెప్పుకొన్నాడు.

ఉభయభాషాకవిత్వ చాతుర్యౌదార్య సకల కవిమిత్రుడైన "దరువూరి అప్పలాచార్యులు" యిట్లా చెప్పుకున్నాడు:

"......... హరిపేర కృతుల
దేవభాషను గొన్ని తెనుగున గొన్ని
ప్రావీణ్యమున జేసి భక్తి నర్పించి
యును దనియని మది నూహించి నిప్పు
డొనరించు నైరావతోత్తమ చరిత
మను నామమున నొప్పునది యక్షగాన
మొకర శ్రీనరహరి కొసగ దలంచి,"

పురిజాల లక్ష్మీనారాయణ కవి:

"...........రామభద్ర నృపతి,
నన్ను దగినట్టి సంభావనలను దనిసి

కృష్ణునకు పారిజాత మంకిత మొనర్చి
చెప్పుమన యక్షగాన మే జేసి తిట్లు."

అని పద్య, గద్య, ద్విపద పదభరితముగ రచించినట్లు చెప్పు కొన్నాడు. శివతత్వసారమును లక్ష్మణరావుగారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ప్రకటిస్తూ, శివతత్వసారప్రతిలో జగ్గుభట్టరచిత "సురాభాండేశ్వర" మున్నట్టుకూడా వ్రాసినారు. లేఖకుడు దానిని క్రీ. శ. 1800 లో వ్రాసినట్లు ఉన్నది. ఇది మిక్కిలి ప్రాచీనమైన యక్షగానమై యుండవచ్చు. ఆప్రతి ఇప్పుడెక్కడున్నదో తెలియదు. వారణాసి అచ్యుతరామకవి 1776 వ సం. లో సురతానీ పరిణయ మనే యక్షగానం వ్రాశాడు. ఆ యక్షగానాన్నే తాను మరల ప్రబంధముగా రచియించినట్లు చెప్పుకున్నాడు.

"అరయగ నది సురతానీ
పరిణయమన యక్షగాన పద్ధతిగా మున్
విరచింపంబడె నిప్పుడు
విరచింపుము గద్యపద్యమిశ్రిత కృతిగాన్"

జీవద్భాషలో దివ్యమైన కృతులు వ్రాసిన త్యాగరాజు "నౌకా చరిత్ర", "ప్రహ్లాద చరిత్ర" అనే యక్షగానాలు వ్రాశారు. ఈయన తాతగారైన "గిరిరాజ" కవికూడా అనేక నాటకాలు వ్రాసినాడు.

"కండచక్కెరలీల గల్పించి రుచుల
గండుమీరిన యక్షగానంబు మిగుల
గరిమెను గిరిరాజకవి విరచించె"

అని శాహేంద్రచరితమనే యక్షగానంలో చెప్పుకున్నాడు.

రఘునాథరాయలు, శాహరాజు, శివాజీ, విజయరాఘవుడు అనే తంజావూరు రాజులుకూడా నాటకాలు వ్రాశారు.

పై విషయాలనుబట్టి చూస్తే మహాప్రబంధ కవులున్నూ, మహాపండితులున్నూ, మహారాజులున్నూ, ఉభయభాషా పారంగతులున్నూ, ఈ యక్షగానాలను వ్రాసేవారని స్పష్టమవుతున్నది.

ఇం తేగాకుండా, వీటినిమహారాజులూ, పండితులూ ఆదరించేవారనిన్నీ, ప్రజాసామాన్యమూ, బుధులూ చూచి ఆనందించేవారనిన్నీ స్పష్టమవుతూ వున్నది. దేవుళ్ళుకూడా వీటిని మెచ్చుకునేవారట !

వీటిని పూర్వకాలమున బాహాటముగా ఆడేవా రనటానికి నిదర్శనము చూపుతున్నాను. పింగళి సూరన్న ప్రభావతీ ప్రద్యుమ్నములో నాటకా లాడేవాళ్ళనుగురించి యెత్తుకొని విమర్శించాడు. వజ్రనాభసభలో నాటకా లాడించాడు.

పాల్కురికి సోమనాథుడు వ్రాసిన బసవపురాణంలో శిరియాళచరిత్ర నాటకంగా ఆడేవారని యీవిధంగా చెప్పినాడు :

"కర మర్థి నూరూర శిరియాలు చరిత
పాటలుగాగట్టి పాడెడువారు
అటుగాక సాంగభాషాంగక్రియాంగ
పటునాటకంబుల నటియించువారు"

క్రీడాభిరామంలో మాచల్దేవి వారాంగననుగూర్చి వ్రాస్తూ మంచనశర్మ నోట ఈ మాటలు పల్కించబడ్డవి :

"లెస్సగాక కిరాట యీ లేమచరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన
దీని జూడంగబోదమా యీ నెపమున
నరసి చూతము మన కేమి యచట ననుచు"

ఇది 1420-పదిహేనవ శతాబ్దాదియందలి విషయము. శ్రీనాథుని కాలంలో యక్షగానాలు పాడుతూ, ఆడుతూ వుండేవా రనడానికి యిదివరకే నిదర్శనాలు చూపినాను.

తంజావూరు రాజులకాలంలో ఈ యక్షగానాలూ, నాటకాలూ పుష్కలంగా ప్రదర్శించేవారు. ఇందుకొరకై రాజులు రాజభవనమందు నాట్యశాలలు ఏర్పాటుచేసి, వాటిలో ఈ నాటకాలను ప్రదర్శింపజేసేవారు. వీరి కాలంలోనే రంగాజమ్మ మున్నగు స్త్రీలు నాటకాలు వ్రాసినారు. పై నాటకాలలో స్త్రీలుకూడా వేషాలు ధరించేవారు.

రఘునాథరాయలు

"భరతవిద్యాధురంధరుడౌట, రంగస్థ
లంబు రామాలంకృతం బొనర్చె"

అనిన్నీ,

"ఏరాజు వీక్షసమీహితకర్నాట
రమ నాట్యవిద్యకు రంగభూమి"

అనిన్నీ,

"మాటల నేర్పులా సరస మార్గములా కొలువుండు రీతులా
పాటల గంధులా కళల భాగ్యములా బహుదాన లీలలా
నాటకశాలలా యొకటనవల దెన్నిట చూడ నన్నిటన్
మేటియు కీర్తిలోలుడు సుమీ రఘునాథనృపాలు డిమ్మహిన్"

అనిన్నీ,

"భరతశాస్త్ర ప్రౌఢమార్గైకలాస్య
రసాస్వాదనకోవిదా!

అనిన్నీ విజయవిలాసంలో చేమకూరి వెంకన్న చెప్పినాడు.

ఇక యీ యక్షగానాలు ప్రశస్తమైన సారస్వతశాఖ అనడానికి యేమైనా సందేహం వుంటుందా?

అముద్రితాంధ్రవాఙ్మయ సూచికనుపట్టి చూస్తే తెనుగులో 400 లకు పైగా యక్షగానా లున్నట్లు స్పష్టమౌతోంది. ఇందు సుమారు రెండువందలు ముద్రితములైనవి. మిగిలిన వముద్రితములు. తెలుగువాళ్ళ ఉదాసీనత కీటకరూపము ధరించి ఈ యముద్రిత దివ్య కావ్యఫలములను తినివేస్తూ ఉన్నది.

ఈ యక్షగానాల్లో వాడిన భాష జీవద్భాష, జాతీయం. వీటిని బట్టి ఆకాలపు సంఘమందలి ఆచారవ్యవహారములూ, ఆనాటి వారి పలుకుబళ్ళూ తెల్లమవుతవి. అంతేగాకుండా ఆనాటిప్రజల వేషములు కూడా మనము తెలుసుకోవచ్చును. చరిత్ర పరిశోధనకూ, భాషా పరిశోధనకూ ఇవి గనులు.

కోలాచలం శ్రీనివాసరావుగారు 1911 వ సంవత్సరము ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో యక్షగానాలనుగురించి ఈవిధంగా వ్రాసినారు:

"నన్నయార్యుని మొదలుకొని 19 వ శతకం అంతమువరకు నాంధ్రమున నాటకములు లేవని పలువురు పండితులు 'వాకొను చున్నారు. ఇది విశ్వసనీయము గాదు. ఆంధ్ర నాటక సాంఘికు లనే లుండిరి. వారు భాగవత, భారత, రామాయణాది గ్రంథ సంబంధ కథలను సంపూర్ణముగా నడుచుండిరి. గోపికాలీలలు, పారిజాతాపహరణము, విష్ణుమాయావిలాసము, సైంధవ వధ, కీచక వధ, ద్రౌపదీ వస్త్రాపహరణము, హరిశ్చంద్ర నలచరిత్రలు, సారంగధర, కుమార రామచరిత్రలు, లేపాక్షి రామాయణము, ధర్మపురి రామాయణము, విద్యుత్ప్రభావిలాసము మొదలగు ఆంధ్ర నాటకము లనేకము లుండెను. వీనికి యక్షగాన నాటకములని ప్రసిద్ధనామ ముండెను. వానిని నాటక సాంఘికులు రాజగృహములలో నేమి, ధనికుల యిండ్లలో నేమి, వీధులలో నేమి చక్కగా ప్రదర్శించు చుండిరి. ఈ నాటక సాంఘికులలో అనేకులు పండితులుండిరి. వారి (వంశస్థులు) యింటిపేరుతో నిప్పటికి నచ్చటచ్చట నున్నారు. ఘట్టుదేశపువారు, లేపాక్షివారు, ధర్మపురివారు, భాగవతుల రంగయ్యగారు (కూచిపూడివారు) మొదలగువారు దేశదేశములూ సంచరించుచు, నాటకము లాడి బహుమానము లంది మాన్యము లార్జించి పొగడిక గనినారు. వీ రాడుచుండిన నాటకములు కొన్ని యక్షగానములని యచ్చోట్ల పిలువబడినవి."

ఇక యక్షగానము రసవత్ప్రబంధమని నిరూపణచేయడానికి కందుకూరి రుద్రయ్య వ్రాసిన సుగ్రీవవిజయమనే యక్షగానాన్ని గురించి కొంచెము చెపుతూవున్నాను. ఈ సుగ్రీవవిజయంలో 33 సంధివచనాలు, 14 జంపెలు, 11 ద్విపదమాలికలూ, 9 త్రిపుటలూ, 6 అర్థచంద్రికలూ, 5 అటతాళములూ, 4 గీతములూ, 2 సీసములూ, 1 ఉత్పలమాలా, 1 కురుజంపె, 1 ఏ

తాళమూ, 1 కందము, 1 ధవళమూ, 1 ఏలపదమూ ఉన్నవి. దీన్నిబట్టి యక్షగాన లక్షణము కొంతవరకు మన మూహించ వచ్చును. ఇందు మొదటి పద్యంలో త్రిమూర్తులను, వారి భార్యలను, విఘ్నేశ్వరుని, దేశికులను నుతించి, సుకవులను పొగడి, కవితా జడులను నిరసించాడు. తరువాత, కృతీశ్వరుడైన కందుకూరి జనార్ద నుని త్రిపుటలో కొనియాడాడు. పిమ్మట అర్ధచంద్రికలలో షష్ఠ్యంత ములు చెప్పి,

"అని యంకితంబుగా నాయొనర్పంబూనిన సుగ్రీవవిజయమనే యక్షగానమునకు కథాక్రమం బెట్టిదనిన" అని కథాప్రవేశం చేశాడు. దీనినిబట్టి యక్షగానములను ప్రబంధము లనుటకు కారణం తెలియు చున్నది.

ఇందలి కథ :

శ్రీరాముడు లక్ష్మణసమేతుడై ఋష్యమూకమునకు వెళ్లుట, సుగ్రీవుడు భయపడి హనుమంతుని పంపుట, హనుమంతుని రాయ బారము, సుగ్రీవునితో స్నేహమూ, శ్రీరాముని బలప్రదర్శనమూ, వాలి సంహారమూ, సుగ్రీవ పట్టాభిషేకమున్ను.

సీతను వెదకుతూ శ్రీరాముడు లక్ష్మణునితో పంపాప్రాంత మున సంచరిస్తూ వుండెను. అప్పుడు సుగ్రీవుడు వారిని జూచి ఇట్లు హనుమంతునితో అన్నాడు :

"వీరు మనలను వధియింప వేషమొంది
వాలి పంపున వచ్చినవారుగాను
నాకు గాన్పించుచున్నది, గాకయున్న
తాపసుల కేల శరచాపధారణములు."

అప్పుడు హనుమంతుడు ఈవిధంగా చెప్పాడు :

"ఈ మనోహరరూప నైఖరు
లిట్టి తేజము గలుగువారికి
భూమి నెటువలె దుష్టగుణములు
బొడము నయ్యా !

ఏను నచటికి బోయి వారల
పూని కంతయు తెలిసి వచ్చెద
భాను నందన వెకువ నేటికి
బంపు నన్నూ."

సుగ్రీవుడు హనుమంతుని పంపి భయంతో మలయాద్రికి పోయాడు. హనుమంతుడు రామలక్ష్మణుల సంగతి పూర్తిగా తెలిసి వచ్చి సుగ్రీవుడితో అంటున్నాడు :

"......ఓ కపికులాధీశ
ఆరూఢి నీ కనాయాసంబుక తన
శ్రీరాము డనెడి నిక్షేపంబు దొరకె
నింక నీ యక్కర లెల్లను దీరె
గొంకక రఘురాము కొల్వ కేతెంచి ___"

సీతా వియోగానికి దుఃఖిస్తూ శ్రీరాముడు ఈ రీతిగా అనుకుంటున్నాడు :

త్రిపుట నన్ను విడిచియు నిలువజాలక
నాతి వచ్చితి వడవి దిరుగను
నిన్ను విడిచే నెట్టు లోర్తును
నీలవేణీ!
రమణిరో నిను బాసి నప్పుడె
రాత్రి రే శివరాత్రి రాయెను
నిమిషమైనను నాదు కంటికి
నిదుర రాక.

జంపె తరణి కులమున బుట్టి శరచాపములు బట్టి
తరుణి గోల్పడుకంటె, మరణమే మేలు,
నను శౌర్యవంతుడని తన పుత్రి నిడినట్టి
జనకవిభు డీవార్త విని పగవకున్నె?
ఒకట నొచ్చము లేక నున్న రవివంశమున
కకట నాచే యింత యపకీర్తి వచ్చెన్.

పిమ్మట శ్రీరాముడు సుగ్రీవునితో స్నేహంచేసి వాలిని బాణంతో కొట్టాడు. అప్పుడు వాలి శ్రీరామునితో అంటున్నాడు :

"నను బేసుకొని పిలిచి నా ముఖాముఖి నిలిచి
జననాథ పోరాడి జంపలేనైతి.
పొంచి వేసితి రామభూపాల! నృపధర్మ
మెంచికోలేనైతి వెంత జేసితివి.
శ్రీరామ నీ రామ జెరగొన్న రావణుని
వారిధుల ముంచితిని వాలమున జుట్టి.
ఒక మాట నాతోడ నొసరంగ దెల్పవై
తట రావణుని దున్మి యా సీత దేనె!"

వాలి మూర్ఛనొందినసంగతి తారకి తెలిసింది. దుర్భర దుఃఖముతో ఆమె వారి వద్దకు వచ్చి విలపించింది. సుగ్రీవుని దూరింది; శ్రీరాముణ్ణి చూచి యీవిధంగా చెప్పిపోదుస్తోంది :

"ఆలి చెరగొనిపోయినట్టి దశాశ్యుడుండగ నిర్నిమిత్తము
వాలి నేటికి జంపితివి రఘువంశతిలకా
న్యాయ మేటికి దప్పితివి నరనాథ జానకితోడనే చెర
బోయెనే నీ రాజనీతియు భూరి మహిమల్."

వాలి మూర్ఛ తెలిసి అంగదుణ్ణి ఊరార్చి రాముడితో యీ విధంగా అంటున్నాడు :

"ఓ మహాత్మ! దయాపయోనిధి! రామ!
భూమిపాలేశ నా పుణ్య మెట్టిదియొ
నీచేత మృతినొంద నేడు తుర్యాశ్ర
మాచారపరులకు నందగా రాని
వైకుంఠ పదవి నిర్వక్రంబు గాగ
గైకొంటి నా పాతకము లెల్ల బాసె,
భానువంశాధీశ భవ నాశ రామ
ప్రాణముల్ నిర్వహింపవు మేన నింక
బాణంబు దీయవే పార్థివోత్తంస!

అనగా రాముడు చేరవచ్చి,

"......నిజభుజాఖర్వదుర్వార
త్రైలోక్యరక్షణ ధర్మప్రశస్తి
నెలమి పెంపగునట్టి నిజహస్తమునను
కపికులాధీశు వక్షము గాడియున్న
విపుల సాయకము బల్విడి పెల్లగింప,"

వాలి యూర్ధ్వలోకమునకు పోయెను. కపు లప్పుడు సుగ్రీవునకు కనకకుంభముల నభిషేకము జేసి,

అర్ధచంద్రికలు ఫాలమున బంగారుపట్టమును గట్టి
అకుదండ రత్నసింహాసనముమీదన్
ప్రేమచే గూర్చుండబెట్టి రవ్వేళన్

పుణ్యాంగనలు ధవళములు పాడిరట; ఎటువలెను :

"శ్రీరాముడు, గుణధాముడు, వారిజలోచనుడు
శూరత రావణు గూలిచి నారీమణి దేవలయుౙ
రాముని గృప కపిరాజ్యము క్షేమంబున బాలించే
శ్రీమంతుడు సుగ్రీవుడు భూమండలి బాగడొందుౙ."

అపుడు సుగ్రీవుడు శ్రీరామునకు కానుకలు తీసుకొనివచ్చెను. ఆ గిరిప్రాంతాలలో ఉండే చెంచీతలు ఈవిధముగా ఏలలు పాడిరి :

"భానువంశమున బుట్టి
దానవ కామిని గొట్టి
మానివరులు సన్నుతించగా, ఓ రామచంద్రా!
పూని మఖము నిర్వహింపవా
రాతి నాతి జేసె పురా
రాతి చేతి విల్లు విరచి
భూతలేంద్రు లెల్ల మెచ్చగా, ఓ రామచంద్రా!
సీతను వివాహమాడవా?"

పైన ఉదాహరింపబడ్డ గ్రంథభాగములను బట్టిచూస్తే "సుగ్రీవ విజయ"మనే యక్షగానము ఎంత రసవత్తరమైనదో బోధపడుతుంది.

యక్షగానాలలో, అందులో ముఖ్యముగా "భామవేష" మనే పారిజాతంలో ముద్దులు మూటగట్టే వచనా లున్నాయి. శిష్టులూ, పామరులూ, స్త్రీలూ, వీరికి తత్తదుచితభాష, జీవద్భాష వాడబడ్డది. మచ్చుకు "భామవేషం" లోంచి వచనం ఒకటి ఉదాహరించి వ్యాసము ముగిస్తాను. ♦

శ్రీకృష్ణుడు కనపడక సత్యభామ విరహబాధపడుతోంది. కలలు కంటోంది. ఒకనాటి స్వప్నవృత్తాంత మామె చెలికత్తెతో ఇట్లు చెప్తోంది.

ముచ్చట :

"వో యమ్మా వకానొకనాడు పడుకమందిరములో హంస తూలికాతల్పమందు కేళికాగృహములయందు వజ్రవైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్యములు స్థాపించినటువంటి నగరియందు పవళించి యుండగా స్వామివారు వచ్చి గానంచేసినారమ్మా, నేను గాఢాంధకారమైనటువంటి సుషుప్తిలో ఉండగా కన్ను తెరిచినానమ్మా, అంతట స్వామివారువచ్చి శయ్యమీద కూర్చున్నారమ్మా, నాకు కలతనిద్దరసమయంగనుక దిగ్గున లేచినానమ్మా, లేచి పరిమళద్రవ్యములు మొదలైన చందనగోష్ఠిచేసినానే అంతట స్వామివారు పరున్నారే, నేను కూర్చునానే, పాదసేవ చేసినానే, అప్పుడు స్వామివారు నన్ను తొడలపై కూర్చుండబెట్టుకుని, అమూల్యమైనటువంటి ఆభరణములు అలంకరించి, నిలువుటద్దం తెచ్చి యెదట వుంచి నీడలు చూచి, సత్యభామా! నీవే చక్కనిదానవా, నేనే చక్కనివాడనా, అని అడిగేన్నె వోశమ్మా!- అడిగేటువంటివరకు, ఆడబుద్ధి అపరబుద్ధికనుక, అబలలముగనుక, తెలియక నేనే చక్కనిదాననంటినే వోశమ్మా! - అంతట స్వామివారు నామీద చాలా కోపంచేసి, దిగ్గున లేచి చక్కాపోయెనా

♦ యక్షగానాలనుగురించి తెలుసుకోదగ్గ విషయాలు ఇంకా చాలాఉన్నవి. వేర్వేరు భాండాగారాలలో నున్న యక్షగానాలు చదివితేనేగాని వీటి పరిణామ పద్ధతి తెలుసుకోవడం కష్టం. కొన్ని యక్షగానాలు భాగవతుల నోళ్ళల్లోనే ఉన్నవి. కొన్ని తాళపత్రాలలో ఉన్నవి.

వోశమ్మా! మన స్వామివారుయెందు బాయెనో, యెక్కడ బాయెనో వెదుకుదామటే వోశమ్మా!"

సత్యభామ తాళలేక చెలికత్తెను పిలిచి శ్రీకృష్ణుని దగ్గరికి రాయబారం పంపుతోంది. ఆ సందర్భములో ఆమె చెప్పిన మాటలివిగో:

"నల్లనివాడో యమ్మా। నా ప్రాణసఖుడమ్మా
కొమ్మరో వేగమె బొమ్మ।
గోపాలరాయుని తోడితేగదవమ్మా.

అని దర్వుపాడి వచనం చెప్తోంది.

"వోశమ్మా అందాకా పోయివస్తావుటమ్మా! స్వామివారి దాకానే, కృష్ణమూర్తిదాకానమ్మా ద్వారకదాకానే, కైలాసం దాకానే, వైకుంఠందాకానే. రాయబారంగా పోయిరావే, అనుసంధానంగా పోయిరావే! స్వామివారినీ, నన్నూ కూర్చవే కుచ్చుల దండ లిస్తానే, చేర్చవే చేప్పుకట్టు బొట్టు యిస్తానే, స్వామివారిని తీసుకురావే వెంటబెట్టుకురావే తోడుకురావే, ఏడువారాల సొమ్ములున్నవమ్మా- వకవారం పెట్టినసొమ్ము వకవారం పెట్టకుండా ఏడు వారాలకు ఏడు ముస్తాబుల సొమ్ముగాదటమ్మా - పెట్టెలో పెట్టి ఒక పెద్దపెట్టెలో ఏడు చిన్న పెట్టెలు పెట్టినారమ్మా, పెద్దపెట్టి భోషాణంలో పెట్టినారమ్మా, భోషాణంగదిలోపెట్టి తాళం వేసినారమ్మా, పెట్టి నాదగ్గిరే ఉన్నదమ్మా చెవి స్వామివారి ఆధీనంగా వున్నదమ్మా, వోశమ్మా అది యెట్లా యిత్తునమ్మా!"



# కొరవంజి

కొరవంజి అనగా ఎరుకలసాని అని అర్థము.

కొరవంజి పదమునకు కురవంజి అనే రూపాంతరంకూడా గ్రంథములలో కనిపిస్తోంది.

ఈ ఎరుకలసాని పూర్వకాలంలో ఎక్కువ పలుకుబడి సంఘములో సంపాదించుకొంది. రాజులున్నూ, రాణీలున్నూ ఆవిడకు సులభముగా దర్శనమిచ్చి, ఎరుక చెప్పించుకొని ఉచితవిధంగా బహుమతు లిచ్చేవారు.

కదిరీపతి వ్రాసిన శుకసప్తతిలో ఒక కొరవంజి రాజుగారి దర్శనానికి వస్తుంది. ఆవిడను కవి యీవిధంగా వర్ణించాడు:

"ఇఱుకువలి గుబ్బచన్నుల
యెఱుకుంజవరాలొకర్తె యెఱుకో యవ్వా
యెఱుకోయని తన చందం
బెఱుకపడంగా హజార మెలమిం గదిసెన్.

అప్పు డప్పుడంతుకతెఱం గమ్మహీంద్రుండు పరిచారికా జనంబులవలన విన నవధరించి సమ్ముఖమ్మునకు రావించిన—

సవరనిపనివన్నె అవిక పిక్కటిలంగఁ
గులుకుపాలుబ్బుగుబ్బలు చెలంగ
ముంజేతులను ముఖాంబుజమున నొకవింత
పొలుపు దెల్పెడు పచ్చబొట్టు లెసఁగఁ
గుఱుమాపుపయ్యెంట చెఱఁగులో నిడుకొన్న
ముద్దుఁబల్కులచిన్ని బుడతం డమరఁ
దరతరంబులనుండి తన యింటవెలయు పు
త్తడిపైఁడిబుట్ట మస్తమున వెలుఁగ
బొమలసందున నామంబు, భూతిపూఁత
నెన్నొసటఁ, బుక్కిటవిడెంబు, కన్నుఁగొనలఁ

గాటుక, రహింపవచ్చి యాక్ష్మాతలేంద్రు
చరణముల కోరగా మొక్కి చక్క నిల్చి;
ఇది దారికట్టు, మొనక
ట్టిది, కాంతావశ్యకర మిది నీ మదిఁ
పొడవించు నోనరేశ్వర !
పదిలంబని తెల్పి కొన్ని బదనిక లొసఁగెన్
తలఁపున నిది గారడమని
తలఁపకుమా, సింగఁడిల్ల తఱిగొండదరిన్
దలమోచి తెచ్చినవి యివి
తలనుంచుము పసిఁడి తాయెతలనుంచి నృపా !

అని విన్నవించిన యమ్మత్తకాశినీకరాంబుసహస్తాంబగు నయ్యుత్తమ దివ్యౌషధ త్రయంబు రయంబునన్ గ్రహించి కరుణావలోకనపరుండై ప్రియ వినయ గంభీరభాషణంబుల నిట్టులనియె—

ఏయేభూములఁ జూచినావె కొరవం
జీ ! రూపలావణ్య రే
ఖాయుక్తిందగు కొమ్మ లెందుఁ గల రీ
క్ష్మామండలిన్ హాసభా
వా యన్యైక విలాస నైఖుసుల మే
లం దెవ్వారిం జెందు న
య్యాయావార్తలు తెల్పవే మది కమం
దానందముం జెందఁగన్."

ఉత్తమ దివ్యౌషధాలు అమ్మడమేకాకుండా, కొరవంజి చేతులుచూచి భవిష్యత్తుకూడా చెప్పుతుంది. తన వేషమహిమవల్లనై తేనేమి, తన మాటల చమత్కారమువల్లనై తేనేమి, వర్తమాన భూత భవిష్యత్తులు కరతలామలకం చేసుకొన్న తన ప్రజ్ఞవల్లనై తేనేమి — ఈ కొరవంజి తెలుగువాఙ్మయంలోనే కాకుండా, కన్నడ, ద్రావిడ వాఙ్మయాలలోకూడా శాశ్వతస్థానం సంపాదించుకొంది.

తెలుగు ప్రబంధాలలో అక్కడక్కడ కొరవంజివర్ణనలు కనిపించినా, అవి అంత చెప్పుకోదగ్గవి కావు. కాని, పాత తెలుగు నాటకాల్లో సాధారణంగా ఈ కొరవంజి ప్రధానస్థానం ఆక్రమించుకొన్నది.

ఈ పాత తెలుగు నాటకాలకి యక్షగానాలని పేరు.

తెలుగు ప్రజాసారస్వతములో బాలవాఙ్మయం, స్త్రీల సారస్వత, యక్షగానాలూ దివ్యమైన శాఖలని యిదివరలో నిరూపించాను. యక్షగానాలు పండితులూ, పండితకవులూ ప్రాశారననీ్న, మహారాజులూ, దేవుళ్లూ వాటిని ఆదరించారనిన్నీ, అవి రసవత్ప్రబంధములనిన్నీ యిదివరలో మనవి చేసికొన్నాను.

కొన్ని యక్షగానాలలో - మరీ ప్రాచీనమైన వాటిలో — కొరవంజిపాత్ర లేదు. రుద్రయ్య సుగ్రీవవిజయములో కొరవంజి రాదు.

కొన్ని యక్షగానాలలో కొరవంజి పాత్ర ఉంటుంది. అట్టి యక్షగానాలకు కొరవంజులని పేరు.

"కొరవంజి పాత్ర ప్రవేశముగల యక్షగాన రచనమునకు కొరవంజియని పేరు"- (ఆంధ్ర వాఙ్మయ సూచిక.)

ఒట్టి వినోదం కల్పించడానికి మాత్రమేకాకుండా, ఈ కొరవంజి కథానిర్వహణానికికూడా ఎంతో తోడ్పడుతుంది. సంస్కృత నాటకాల్లో విదూషకుడివంటిదే తెలుగు యక్షగానాల్లో కొరవంజి. తెలుగు కృష్ణలీలలనే నాటకాల్లో (యక్షగానాల్లో—) చల్లమ్మె గొల్లది ఈ కొరవంజివంటిదే. వినోదంతో జోడించి కథానిర్వహణం జరగాలంటే ఈ కొరవంజి ఉండితీరాలి — ప్రతాప రుద్రీయంలో పేరిగాడులాగ.

వినోదమూ, కథానిర్వహణానికి సహాయమూ కాకుండా ప్రేక్షకులలో విజ్ఞానబీజాలు చల్లుతుంది ఈ కొరవంజి.

"భామకలాపం"లో ఏవిధంగా గొల్లది వేదాంతోపన్యాసం చేసి ప్రేక్షకులకు విజ్ఞాన మందిస్తుందో, ఆ విధంగానే కొన్ని యక్షగానాల్లో కొరవంజి పూర్తిగా వేదాంతబోధ చేస్తుంది.

ఇంతకీ యక్షగానాల్లో వేషం వేసుకువచ్చే కొరవంజి మామూలు ఎఱుకలసాని కాదు.

పార్వతీ పరమేశ్వరులు విలాసార్థము కిరాతవేషం ధరించిన విధంగా, భారతీదేవో, పార్వతీదేవో కొరవంజివేషం ధరించి యక్షగానాల్లో వినోదం కల్పిస్తున్నది, విజ్ఞానం వెదచల్లుతున్నది, కథను నిర్వహిస్తున్నది.

మన తెలుగులోఉన్న కొన్ని కొరవంజి నాటకాలు:- జ్ఞానకొరవంజి, జీవకొరవంజి, భిన్నకవులువ్రాసిన ఎఱుకల కొరవంజులు, రాజమోహన కొరవంజి, సత్యభామ కొరవంజి, జానకీ సుఖోల్లాసకొరవంజి వగైరా.

కన్నడంలోకూడా ఇట్టి యక్షగానా లున్నవి. "కన్నడ సంస్కృతి" అనే గ్రంథంలో ఉదాహరించబడ్డ కొన్ని యక్షగానాలు :- పార్వతీ కొరవంజి, అర్జున కొరవంజి, కృష్ణ కొరవంజి, రామాయణ భారత భాగవతములు.- ఇంతేకాకుండా, మైసూరు ఓరియంటల్ లైబ్రరీలో అముద్రిత పుస్తకములపట్టి చూస్తే యీ యక్షగాన సాహిత్య మెటువంటిదో తెలుస్తుం దంటున్నాడు గ్రంథకర్త నరసింహశాస్త్రిదేవుడు యం. యే.

మన తెలుగుకొరవంజి నాటకాల్లో వర్ణించబడ్డ యెఱుకసాని ఎట్టిదో, దాని చాకచక్య మెట్టిదో, దాని మాటలనేర్పు ఎట్టిదో యీ క్రింది ఉదాహరణలవల్ల గ్రహించవచ్చు.

(౧) గోకులపాటి కూర్మనాథకవి వ్రాసిన మృత్యుంజయ విలాసము-

పార్వతి శివునిగూర్చి తపస్సు చేస్తుంది. శివుడు సమాధిలో ఉంటాడు. మన్మథుడు తపోభంగంచేసి దగ్ధమైపోతాడు. పార్వతిని హిమవంతుడు తీసుకుపోతాడు. అప్పుడు శివుడు విరహవేదన పాలై

పార్వతిని చూడవలెనని తహతహ లాడతాడు. తాను కొరవంజి వేషం వేసుకొంటాడు. పార్వతిదగ్గిరికి వెళ్లి ఎరుక చెప్పుతాడు. ఎట్లంటే -

"శివుఁ డప్పు డాత్మీయచిహ్నముల్ మాని
నవ తనూ ధవళిమ నగవునఁ బూని
కర కురంగాకృతి కడగంట నిలిపి
తరుణేందుకళ ఫాలతటిఁ గీలుకొలిపి

* * *

పృథివి మహత్త్వంబు పిఱుఁదులయందు
పృథుత రసరసత హృదయంబునందు
బంధుర తేజంబు హా తెరయందు
గంధమహత్త్వంబు కాయంబునందు

* * *

కలికి బంగరుపూల గాజులు దొడిగి

* * *

ముక్కునఁ బలు కెంపు ముక్కర చెలఁగ
పెక్కు రత్నము పూసపేర్లు చెన్నొంద
శిరమున రత్నభాసిత పాత్రఁ బూని
యెరుకతయై వచ్చె హిమశైలమునకు."

* * *

ఆటతాళము

"ఎరుకసాని వచ్చె ఎరుకనుచు ॥అను॥ ఎరుకలసాని వచ్చె నెరుకో యెరుకో యెరుకో యనుచు ॥ఎరు॥

మురిపెంపు నడకలతోడ ముంగురు లల్లాడ - సరసంపు మాటల - చతురతతో - శిరమున నవరత్నఖచితమైన బుట్ట పెట్టి - మెఱుపువలెను మేను మెఱయఁగను."

* * *

వచ్చి ఈ విధంగా తనగొప్ప చెప్పుకొంటోంది. —

ఆ ట తా ళ ము .

*          *          *

సరసిజభవురాణి పరిణయమాట మా - యెరుకను కాద టవె - సురపతి పౌలోమి శోభనకృతి మా - యెరుకను కాదటవె యోదేవి - తరుణి మదికి నేఁ దార్కాణగాఁ జెప్పి - తగుకోర్కె లందెదనె - యోదేవి॥ యెరుకగలవారు గల రెందరైన మా సరి వత్తురె రమణి॥

ద్వి ప ద

అంగన యామాట లాలించి వేడ్క
బంగారుచేటలోపలి ముత్తియములు
ముమ్మాఱు తన కరాంబుజమునఁ బట్టి
సమ్మతి ఫాలదేశంబున నిలిపి
మ్రొక్కి యిట్లనెఁ జిత్తమునఁ దలపోసి
మిక్కిలి కంటిసామికిని నామీఁద
నెన్నడు దయవచ్చు నెపుడు పెండ్లాడు
నెన్నఁడు నాకోర్కె లీడేరు ననుచు
చేత ముత్తియములు చేటలోఁ బోసి
నాతి యందిచ్చెను నగుమోముతోడ
నా యెరుకలసాని యాత్మదైవముల
బాయని భక్తితో ప్రస్తుతిచేసె॥

ద్వి ప ద

*          *          *

ఓ భారతిదేవి యో పల్కుమాత
పరఁగంగ నాజిహ్మఁ బాయకయుండి
వెరగొందకుండగఁ వృత్తముల్ నుడువు
ఇగనాలు తొలఁగించె డిగినేశపరుడ
సగినాలు లెస్సగ సాగంగజేయ

నుల్లంబులో నిల్వుండో జేజెలార!
కొల్లాపురీదేవి! గోరెద నిన్ను

*　　　*　　　*

ఈ కాంతమనసు నాయెడ వచ్చునట్లు వాకీయరే నాదు వాక్కున నిలిచి.

అని యిప్పుడు యెంటి వాల్గంటి నంటితినని కేలు గీలించి యేమని యెరుక చెప్పుచున్నది—

అవో దేవి భాగ్యం గల చెయ్యి, పతిష్టగల చెయ్యి, సంతానము గల చెయ్యి, చల్లని చెయ్యి,

అవో దేవియొక్క తలంపు జేసినావు, యొక్క కోరిక కోరినావు, యొక దొడ్డమే లడిగినావు,

అది కాయో పండో, కల్లో నిజమో, అవునో కాదో, చేకూడునో చేకూడదోయని వెనకముందు తొక్కులాడుతున్నావు,

అది కాయ కాదు పండు, కల్ల గాదు నిజము, శీఘ్రుంబే ఇంతలోనె చేకూడుతున్నది.

అది యేకోపుకార్యమంటె యిదుగో యీ కోపు, ఆడవారి వంక తలంపా, మొగవారి వంక తలంపా అంటే యిదుగో మొగవారంటే గడ్డంబు, ఆడవారంటే లక్కాకు—

ఇదుగో నీ యెదలో తలంపు యెన్నాళ్ళ కంటె వకటే రెండే మూండే వకటంటే వక యేడుగాదు, రెండంటే రెండేండ్లు కావు, మూడంటే మూండేండ్లు కావు, శీఘ్రుంబె, యింతలోనె చేకూడుతున్నది, యింక దాపేల, కోడెగాడితో తక్కిరబిక్కరలాడుకుంటా కులకనున్నావె, అప్పుడు నన్ను మెచ్చేవే, కోర్కు లిచ్చేవే,

*　　　*　　　*

నీకు నాథుండ నయ్యెదనని యిప్పు డిచ్చటనే
యున్నాడు, నీపై చాలా దయనచ్చింది,

శీఘ్రముంబె పెండ్లియాడు, నీ కోర్కె చేకూరు,
నమ్మ నా బుట్టతోడని నమ్మించి చెప్పిన—

* * *

ద్విపద

అంత నయ్యింతి యింతంతనరాని
సంతోష మంది యాశ్చర్యంబు నొంది

* * *

యెరుకలసానిగా దెన్న నాపాలి
హరకృపమూర్తియై యవతరించినది
ఇచ్చెలి మెచ్చి నే నే మిచ్చుదాన
నిచ్చేడకు జగంబు లిచ్చినఁ జాల
వన తన మూక్తికహారంబు కంఠ
మున నైచె మల్లెపూమొగ్గలదండ
వసునిపై వరియించి నైచెనో యనఁగ

* * *

వినయవాక్యములచే వీడ్కొల్ప నంత.

కథానిర్వహణానికిన్నీ, వినోదము చేకూర్చడానికిన్నీ యీ కొరవంజి ఏ విధంగా తోడ్పడిందో గమనించ దగ్గ విషయం.

(౨) రంగాజమ్మ వ్రాసిన మన్నారుదాసవిలాసనాటకం—

దరువు

"చెలువ మన్నారుదాసుపై వలపు నిలుప
లేక, కలవరింపుచునున్న కాంతిమతికి
దలఁచిన తలఁపెల్లఁ దార్కాణగాఁ దెల్ప,
నల చెంగమ్మ యెరుక చెలువయై వచ్చె"

చెలికత్తె ఎరుకసాని సంగతి కాంతిమతికి చెప్తోంది—

"విను కాంతిమతి! యెరుక వింత యీవేళ
మినుకు, బంగరుచాయ మెఱయు నెమ్మేను
సున్నాణిముత్యాల సొబగు కమ్మలును

గప్పురా జిగి మించు కస్తురిబొట్టుఁ
బలుచని చెక్కులు బటువు పాలిండ్లుఁ
జెలువైన కెంగేలఁ జెలఁగు బెత్తంబు
* * *

విపులచెండును నెమ్మిపింఛంబు మెఱయ
నురమున బురుకని హారాయలుగాఁ బూని
* * *

ఎఱుకత యొక్కతె యిదె రాజవీధి
నొఱపుగా వచ్చుచునున్న దోయమ్మ.

కాంతిమతి కొరవంజిని పిలిపించింది. ఎరుకసాని వచ్చి తన యిష్టదేవతలను కొనియాడిం దీ విధముగా–

(శ్రీ) రాజగోపాల, దోరకానాత,
బంగారుమన్న, శంగమరేండా,
* * *

నల్లనిదేవర గొల్లల సామి
* * *

ఈ కలికి తలంచిన తలంపు నిజముగా బలుకవయ్యా, నిక్కముగా బలుకవయ్యా, తార్కాణముగా బలుకవయ్యా —

అమ్మాయమ్మ, అమ్మాయమ్మ, శెయి సూ
పు, శెయి సూపు, శెయి సూపవే
దుండి, దనముగల శెయ్యో, దాన్యము
గల శెయ్యో, బంగారు శెయ్యో, బా
గ్గెముల శయ్యో దుండి, అటు నిటు
సూడక నే శెప్పే గురి ఊంకొని
వినవే దుండి, కండ్లంటే తోడు, కడు
పంటే కొడుకు, కంటెంటే మగండు
వాండే రెండే వాండు.........
అతం జేవితమువా డంటా అడిగేవే

...... అయితే తెలిపేను వినవే దుండీ -
"వేయూరు వెలదుల వెలయుచు దక్షిణ
నాయకుండని మించి నలువొందువాడు
అతడె నీపతి యగు నందుకు దార్క్షణ
యిత్నైన నెచ్చెలి యిదిగో వచ్చెనే

- అని పలికి యా కలికి చిలుకలకొలికిచేత సకల బహుమతులు జెంది నిజమందిరంబు సేరె.

*   *   *

(3) తులాభారం అనే యక్షగానం (కవిపేరు తెలియదు.)
"బ్రహ్మ సమ్మతిని యా భారతీదేవి
యెరుకలవేషంబు (యింపుగా) దాల్చి
భామను చూడంగ భామిని వచ్చె.

కు రు జం పె

జిలుగు బంగారుచీర తెల్లని జారుకుచ్చులు
మెరయగా గరిమతో గుత్తంపు చం
దురు కావిరవికయు దొడగుచూ
వచ్చె నెరుకత అహాహా॥
చొక్కమగు రత్నములు జెక్కిన
బుట్ట శిరసున బెట్టుకోని।
కుందనపు కట్లమర వేసిన
కురుచ బెత్తము చేతబట్టుకు ॥వచ్చె॥
ఫాలమున నసియాడు అల నెలవంక
పాపిట బొట్టుతో సోగకన్నులు వాలు
చూపులు నై డూర్య పచ్చాబొట్టుతో ॥వచ్చె॥

అంద మలరగ యెడమమూపున ఆడశిశువును గట్టుకూ। మంద యానలతోటి వీధులు మళ్ళీ మళ్ళీ దిరుగుచూ॥ వచ్చె॥

చిలుకతాళియు కంకణమ్ములు
చెలగు దంతపు కమ్మలున్

వెలయు ముత్యపు సరులు గవ్వల
పేరు లల్లలనాడగా.

*　　　*　　　*

కురుజంపె

యెరుకోయమ్మ యెరుక ॥ వచ్చేది పొ
య్యేది యెరుకా। కాగల దయ్యేది
యెరుక దానంబు జేసినా దెరుకా।

♦　　　♦　　　♦

వారణాశికి బోతి నవ్వా। అన్నపూర్ణ
కెరుక జెప్పితి నవ్వా। వరహాలపే రిచ్చె నవ్వా...
అప్పుడు సత్యభామ అడుగుతోంది.

దరువు

"యే సీమదానావె యెరుకతా। నీ
కెందారు సవతులే యెరుకతా।

♦　　　♦　　　♦

మగడు నీపై నెపుడు యెరుకతా।
మక్కువతో నుండునా యెరుకతా.

♦　　　♦　　　♦

బుట్ట ముందర మువ్వారు పూజ జేసి
భాగ్యవతియైన శ్రీ సత్యభామ నపుడు
భమిడి బెత్తంబు తన వ్రేళ్ళ బట్టమనియు
యెరుక జెప్పంగ దొడగె నా మరుని బొమ్మ.

♦　　　♦　　　♦

శ్రీ వెంకటేశ్వ రాశ్రితపారిజాత
మంగళాద్రి నృసింహ మదనగోపాల
బెజవాడ మల్లయ్య బేరికోటయ్య
జిల్లేళ్ళ కనకయ్య శ్రీ సుబ్బరాయ
కోరిక లిచ్చేటి కొల్లాపురమ్మ

గుంటూరు సర్వేశ గువ్వలచెన్న
ఓరుగంటి పురమ్మ ఓ కూనలమ్మ.

* * *

దుండి, వకమేలు కని యడిగినావే, యవ్వోయవ్వా, సతు లకు సాధ్యమగుచోట నుందువే యవ్వ— నారదముని వచ్చెనే యవ్వా, వ్రత మడిగితివే యవ్వ, మగని దాన మిమ్మనెనే యవ్వ, వద్దనకపోతివే యవ్వ, చిరునవ్వు నవ్వకే యవ్వా —

* * *

ఎరుకసాని తన గొప్పతనం చెప్పుకొని చివరకు చెప్పిన మాటలు —

♦ ♦ ♦

"అవ్వా అవ్వా వకటే, రెండే, మూడే, నాలుగే, నాలు గంటే నాలుగు సంవత్సరాలుగావు......నాలుగు దినంబులలోనే నీ వొక గొప్పనోము నోచేవే యవ్వా, నీవు పెనిమిటిని పారుజాత పుష్పమునకు గట్టి దానమిచ్చేవే యవ్వా, నీసవతు లందరు నీమీాదకు కయ్యానికి వత్తురే యవ్వా, సవతులలో నీవు చాలా కించనొందుదువే యవ్వా...

(౮) ఏనుగలూరి పాపరాజు వ్రాసిన రుక్మాంగద చరిత్ర అనే యక్షగానం...

మోహిని విరహబాధపడుతుంటే "నీరజగర్భుని పంపున గారవమున యోగమాయ" యెరుకత వేషముతో వచ్చింది.

"అంగన ! నాదు పేరు కొర
వంజి యటందురు; నాదు సామియున్
సింగడు; తావు ద్రోణగిరి
సీమ, జను లొక్కనియాడ నెప్పుడున్
పొంగుచు సోదె చెప్పి వర
భూషణముల్ కొని వార్తకెక్క మా

బంగరు పల్లెవానిమీదఁ
బాయక నమ్మినవార మెయ్యడన్."

*   ♦   ♦

అని యీ విధంగా యెఱుక చెప్పుతుంది: "సూర్యవంశ కులో ద్భవుండైన రుక్మాంగద రాజేంద్రుడు నిన్ను విడనాడి అన్యకాంతల గూడినాడని నీ మనస్సున నెంచినావే వెర్రితల్లీ, ఆయన నీయందు మోహితుడైనాడు, అన్యకాంతల గూడనివాడు వినవోయమ్మ."

అంతేకాకుండా స్త్రీ సాముద్రికంకూడా చెపుతుంది యీ కొరవంజి.

"శుక్ల పక్షంబు పంచమి శుక్రవార
మంచితంబుగ నతివల కగును మేలు
"తరుణికి దాపలి కుచమున
స్థిరమగు కెంపలరు మచ్చ దీకొనియున్నన్
వర సుతుడు పుట్టు............"

"పొలతికి దాపలి పక్కను
తిలకమువలె మచ్చగలిగి స్థిరమైయున్నన్
తొలిచూలు కొడుకు కలుగును"
"మండూకోదరగతి భూ
మండలమున తరుణి కుక్షి మానితమైనన్
మెండుగ లాభము భాగ్యము
పండితులగు సుతులఁ గాంచుఁ బరమప్రీతిన్"

♦   ♦   ♦

(౫) వెంకటరాయకవి వ్రాసిన లేపాక్షి జలక్రీడ లనే నాటకంలో ఎరుకలవారి పుట్టుపూర్వోత్తరాలు వర్ణించబడ్డవి.

"......అఖిల భూతముల
తెర గెల్ల భంగులు తెల్లంబుగాను
ఎఱుక గల్గినవారమౌటకు మమ్ము
యెరుకలవారని యందురే చెలియ."

అంతేకాకుండా ఈ క్రింది విద్యలుకూడా తనకు వచ్చునని కొరవంజి చెపుతుంది.

"స్తంభన, వశీకరణ, ఆకర్షణ, ఉచ్చాటన, విద్వేషణ, వ్యోమగమన, పరకాయ ప్రవేశాది విద్యలెరుంగుదునే యవ్వా; పర మంత్ర, పరతంత్ర, పరయంత్ర, భేదంబు లెఱుంగుదునే యవ్వా; అశ్వలక్షణ, గజలక్షణ, రత్నలక్షణ, స్త్రీలక్షణ; పురుషలక్షణ, సాముద్రిక లక్షణంబు లెఱుంగుదునే యవ్వా."

♦ ♦ ♦

ఈమె శ్రీకృష్ణబాలునికి చెయ్యి చూచి సాముద్రికంకూడా చెపుతుంది.

(౬) పార్వతీకొరవంజఅనే కన్నడ గ్రంథంలోకూడా కొంచెం హెచ్చుతగ్గుగా ఎరుకలసాని తెలుగు నాటకాలలోవలెనే ప్రవర్తిస్తుంది —

దశరథుడు పుత్రకామేష్టి ఆచరించిన తరువాత కౌసల్య గర్భవతి అయింది. అప్పుడు :

(పరమేశ్వరుడు పార్వతిని పిలిచి కొరవంజివేషం వేసికొని కౌసల్యాదేవికి ఎఱుక చెప్పమంటాడు) కొరవంజివేషం ఇట్లా వున్నది;

(చేత బంగరుబెత్తము, మూపున చిన్న శిశువును కట్టుకొంది.)
ఇట్లు చెప్పింది:

(కొల్లాపురమ్మ ఆనసుమ్మా, ఎరుకచెప్పాతా, నామాట అమృతవాక్యం.)

ఈమె తన దేవతలను పేర్కొంటోంది. తెనుగునాట నాటకాలలో పేర్కొన్న దేవతలు పలువు రిందున్నారు.

♦ ♦ ♦

కొరవంజి కౌసల్యాదేవికి పుత్రోత్సవవార్త చెప్పి శెలవు తీసుకొంటుంది.

కౌసల్యాదేవి కొరవంజికి అనేక వస్త్రాభరణములు, ముత్యములు, రత్నములు యిచ్చి బహూకరిస్తుంది.

♦ ♦ ♦

పై విషయములను బట్టి చూచిన తెలుగు యక్షగానములు ప్రశస్తమైన వాఙ్మయశాఖ అనిన్నీ, ద్రావిడ, కర్ణాటక వాఙ్మయంతో సంబంధము కలవి అనిన్నీ వెల్లడి అవుతోంది.





# మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B182 |
| పుస్తకం పేరు | ప్రజావాఙ్మయము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | CP, BC, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |